

Chandamama, August '49

Photo by B. Ranganadham

కుమ్మరి

# ఆగష్టు 6వ తేది

......అన్ని ముఖ్య కేంద్రములలో...

జుపిటర్ వారి

# కన్నియిన్ కాదలి

లేక....

# తప్పుల తమాషా

అద్భుతమైన హాస్య చిత్రరాజము

A · GOOD · HEARTY · COMEDY · WITH · PLENTY · OF · LAUGHS! ADAPTED · FROM · SHAKESPEARE'S TWELFTH NIGHT

రామనాథ్ · శేఖర్‌లచే
తయారుచేయబడినది..

పూర్ణా · రిలీస్



# చందమామ

ఈ సంచికలో యివి
చదువుకోండి



ఇవన్నీగాక పజిలు, చిక్కు
చదరం, చిక్కు బొమ్మలు,
ఇంకా, ఇంకా ఎన్నోవున్నై.


**చందమామ ఆఫీసు**
పోస్టుబాక్సు నెంబరు. 1686
మద్రాసు. 1.

# పిల్లలకు ఒక కథ

## మనలను పరిశుభ్రముగా ఉంచుకొనుట



అమ్మకు సువ్వీమీద టీముమీద ఇష్టత ఏర్పడినవిధము, నేను శుభ్రముగాను, తీకుగాను కనబడిన విధము ఇది.

కాని ఏలాగో మేము ఒంటరిగాయున్న క్షణమందు దుమ్ముతోను, మురికితోను ఎల్లప్పుడు కప్పబడి యుందుము. తిరిగి నీళ్లు పోసుకోవటమంటే మేము అసహ్యపడుతూ ఉండేవాళ్లము.



అంతట అమ్మ హమాం సబ్బును కొన్నది. ఇప్పుడు దుమ్ములో తిరిగిన తర్వాత నీళ్లు పోసుకోవటమంటే మాకు నిజంగా ఆనందం.



హమాం సబ్బు పెద్ద బిళ్ల పుష్కలంగా సువాసనగల నురుగును యిస్తుంది. మొన్న ఒకరోజున చెప్పకుండానే సువ్వి వెళ్లి ముఖం కడుక్కొంది. టీమూ నేను అదే మొదలు పెట్టాము.




హిందూదేశపు జనులు మక్కువతో వాడేసబ్బు

## ది టాటా ఆయిల్ మిల్స్ కంపెని లిమిటెడ్

వారిచే తయారుచేయబడినది

వేసవికి

## హాయిగొలిపే దుస్తులు

కావాలి సుమా.



మీకు, మీ పిల్లలకు

ఆనందమూ, సొగసూ

యిచ్చే

# బి.డి.యం.కంపెనీ

[కె.హెచ్.శ్యామారావు అండ్ సన్సు]

## బెంగుళూరు వారి

# SAMSONS DRESSES

## మన్నికగల దుస్తులను

నిత్యమూ వాడండి



ఆర్గనైజర్లు :

ఆంధ్రకు :

జి. వెంకటప్పయ్య అండ్ సన్స్,
గాంధినగర్, బెజవాడ.

నిజాముకు :

ఫ్రెండ్స్ ఎంపోరియం,
27, ఘాస్‌మండి రోడ్, సికింద్రాబాదు.



# డోంగ్రేగారి

## బాలామృతం

బలహీనమైన బిడ్డలకు పుష్టియున్నూ, పండ్లు మొలిచేటప్పుడు అయ్యే విరేచనముల నిలిపి, బలమున్నూ, ఆరోగ్యము నిచ్చును.

K.T. Dongre & Co. BOMBAY - 4

స్థాపితం : 1825

## యింగువ

# రామానుజంశెట్టి

మిక్కిలి ప్రసిద్ధిచెందిన యింగువ, వాసన వక్కపొడి, పలసరుకుల వ్యాపారము.

నెం. 285, రాశప్ప శెట్టి వీధి, మద్రాసు - 3



ప్రొప్రయిటర్లు :

కూ. మణివాళ శెట్టి &
కూ. ఆళ్వారు శెట్టి

# హిందీ చందమామ

## ప్రథమ సంచిక



ఎన్నికయిన కథలతో

ఎంతో ఆకర్షవంతంగా

## ఆగస్టు నెలలో వెలువడుతోంది



విడిసంచిక 0-6-0

సాలు చందా రు. 4-8-0 మాత్రమే

నేడే చందాదారులుగా చేరండి



## ప్రతిచోటా ఏజంట్లు కావాలి

యూ. పీ., సి. పీ., బీహార్, రాజాస్థాన్, ఉత్తర పంజాబ్ ప్రదేశాలకు జిల్లావారీగా ఏజంట్లు కావాలి. ఏజంట్లకు మంచి కమిషన్ యివ్వబడును.

ఏజన్సీ నిబంధనలకొరకు నేడే వ్రాయండి.



## చందమామ పబ్లికేషన్సు

పోస్టుబాక్సు నెం. 1686 మదరాసు - 1





సంపుటి 5
సంచిక 2

సంచాలకుడు: చక్రపాణి

ఆగస్టు
1949


# నమో పతాక !


[సుంకర రామమోహనరావు, గుంటూరు]


నమో పతాక - నమో పతాక
వీర పతాక - ధీర పతాక
వీరుల ధీరుల - విజయ పతాక

కర్మవీరుల కదనభూమిలో
అఖిల దేశముల కాదర్శమ్ముగ
ధర్మప్రబోధము చేయు పతాక
శాంతిని చాటే క్రాంతి పతాక

నమో పతాక - నమో పతాక
వీర పతాక - ధీర పతాక
వీరుల ధీరుల - విజయ పతాక



# గురివిసెట్టి

చీమలు దూరని చిట్టడవిని నొక
చిన్న తమాషా జరిగింది.
గారె లమ్ముకొను గుర్విసెట్టి యా
దారిని బడిపోతుండంగా
"పెళపెళ విరుచుకు తింటా"నంటూ
పెద్దపు లడ్డము వచ్చింది.

గుండెలు గుబగుబ లాడీ కోమటి
గురవయ దండము పెట్టాడు;
"ముందీ గారెలు తిను నన్నాపై
తిందుగాని లె" మ్మన్నాడు.

కారుపులంతట బుట్టెడు గారెలు
కసకస విరుచుకు తింటూనే,
లొట్టలు గొడుతూ "రోజీలాగే
బుట్టెడు తప్పక తె" మ్మంది.

"సిత్తము బాబ" య్యంటూ కోమటి
సెట్టీలాగే చేస్తుంటే,
గ్రుక్కలు మ్రింగుతు పులికడనుండే
నక్కకు పిట్టము గట్టింది.

కోమటి గారెలు తెస్తుండంగా
కొరకొరలాడుతు చూచింది;
"విసము గలిపి తెస్తున్నా" డంటూ
నసుగుతు పులితో చెప్పింది.

రచన:
'ఏటుకూరి'

"కలిపాడో లేదో మనకేలా
తెలియద?" మని పులి యడిగింది.
"నే డిని తేలుస్తాచూ" డంటూ
"ఏదీ బుట్టీటు తె" మ్మంది.
బుట్టెడు గారెలు పొట్టనిండ డిని
కొట్టినట్లు పడిపోయింది.

క్రోల్పులి వెంటనె గాండ్రు గాండ్రుమని
గుర్వసెట్టి పై దూకింది.
గురివిసెట్టి దండము పెడుతూ 'నా
కోరికొకటి విను"మన్నాడు.

"చచ్చేటప్పుడు మాపూర్వుల కా
చారమ్మొక టుడ్చిందండీ:
నక్క గుండె తినిగాని చావరీ
యొక్క ముద్దు చెల్లించండి."

"కానీ లె" మ్మని పులినిలబడగా
కత్తి లాగుతున్నాడతడు.
నక్కకు తత్తరపుట్టిం దతనికి
చిక్కకుండ పరువెత్తింది.

"తస్సాగొయ్యం" టూ పులిదానిని
తఱుముకుపోయిం దెచ్చటికో;
"చచ్చిందర నాకొండె" ని గుర్వయ
చక్కా యింటికి చేరాడు.



# అట్టమీది బొమ్మ

గోప, గోపికలతో సహా గోకులం ప్రజలందరూ బృందావనం చేరుకున్నారని కిందటిసారి చెప్పాము. బృందావనం చక్కటి ప్రదేశం. ఎక్కడ చూచినా పంట పొలాలే. ఎక్కడ చూచినా పచ్చిక బీడులే. ఏ పక్క చూచినా గోవర్ధనగిరివంటి కొండలూ, లోయలూ, ఎల్లప్పుడూ ప్రవహించే జీవనదులూ – వీటన్నిటితోనూ బృందావనం కలకల్లాడుతూవుంటుంది.

అటువంటి బృందావనంలో శ్రీకృష్ణుడు పొన్నచెట్టుపైన కూరున్చి మురళి వాయిస్తూ ఉండేవాడు. చిన్నారి కృష్ణుడు వాయించే ఆ మురళి పాట వినటానికి గోపులూ, గోపికలూ అందరూ అతనిచుట్టూ గుమిగూడేవారు. ఆ మురళిగానం విని తన్మయులైపోయేవారు.

చిన్నారి కృష్ణుడు మురళి వాయిస్తూవుంటే, పశువులు, లేగలు మేత మానివేసి వచ్చి అతని పాట వినేవి. ఆ పాటకు ఉత్సాహంకొద్దీ నెమిళ్లు పురివిప్పి నృత్యంచేసేవి. ఆదిశేషువులు ఆలకించటానికి వచ్చేవి.

ఈవిధంగా చిన్నారి కృష్ణుడు, వెన్నెల రాత్రులలో, యమునానదీ తీరాన మురళి వాయిస్తూ గోపులతో, గోపికలతో కలిసి నృత్యం చేసి, వినోదించేవాడు. శ్రీకృష్ణుడు చేసే నృత్యాలలో 'రాసక్రీడ' ఎక్కువ ఆనంద మిచ్చేది. ఈవిధంగా, అవతారమూర్తి అయిన శ్రీకృష్ణుని సమక్షమందు ఉన్నంతసేపూ బృందావనంలో ఉండే పిల్లలూ, పెద్దలూ మాత్రమే గాక, పశుపక్ష్యాదులు సయితం పరవశత్వం చెంది ప్రపంచమే మరిచిపోయేవారు.



పూర్వం ఒకప్పుడు నేపాళదేశాన్ని భద్రకుడనే రాజు పాలిస్తుండేవాడు. ఆ రాజుకు పురోహితులన్నా, జ్యోతిష్కులన్నా గౌరవం ఉండేది కాదు. పురోహితులుపెట్టే సుముహూర్తాలుగాని, జ్యోతిష్కులుచెప్పే ఫలితాలుగాని జరుగుతాయని ఆయనకు నమ్మకంలేదు. ప్రశ్నలు చెబుతామని వారి ఆస్థానానికి ఎవళ్లువచ్చినా, వాళ్ళను తేలికగా మాటాడి, గేలిచేసేవాడు.

ఒకనాడు రాజు వేటకు వెళ్లేడు. ఆయనతోకూడా మంత్రీ, పురోహితుడూ, సేనాధిపతీ మొదలైనవాళ్లంతా బయల్దేరారు. ఇంక వేటకాళ్లూ, కుక్కలూకూడా వెళ్లినవని వేరే చెప్పేదేమిటీ?

వాళ్లంతా అడవిదారినిపట్టి పోతోంటే గోరువంక ఒకటి రివ్వుమంటూ ఎగిరివచ్చి పక్కనున్న ఓ చెట్టుమీద వాలి, 'కుయిక్, కుయిక్' అనికూసింది. రాజు, పురోహితునికేసి చూసి, "ఏమండీ శాస్త్రుల్లుగారూ, ఆ పక్షి పలుకునకు అర్థం ఏమిటండీ?" అని అడిగేడు.

ఆ శాస్త్రుల్లుగారికి పక్షిభాష వొచ్చు. అందుకనే ఆ రాజుగా రాయన్ని అలా అడిగాడు. 'చూద్దాం, ఏంచెపుతాడో' అని అందరూ ఆయనవైపే చూస్తూవున్నారు. ఆ పురోహితుడు కాస్సేపు అటూఇటూ చూసి, దూరాన కొండపక్కనుంచి గడ్డికోసం కొడవలి చేతపట్టుకొని వెడుతోన్న ఓ కాపుకేసి వేలెట్టి చూపి, "ప్రభూ! చూచారా, ఆ వెళ్లే కాపుని? అతడు దారిలో పాము కరిచి చచ్చిపోతాడని యీపక్షి చెబుతోంది" అన్నాడు. ఆమాట విని రాజు అదెంత వరకు నిజమో చూద్దామని వేట మానేసి, తన పరివారంతో ఆ చెట్టుక్రిందే ఆగేడు.

మరి కాస్సేపటికి ఆ కాపు పెద్ద గడ్డిమోపు కట్టి నెత్తిపైన మోసుకొని, ఆ కొండ

పాలంకి వెంకటరామచంద్రమూర్తి — మదరాసు.



పక్క నుంచే తిరిగి వస్తూ, అక్కడ వాళ్లందరికీ ప్రత్యక్షమయాడు.

ఎప్పుడయితే కాపు తమ కంటికి కనబడ్డాడో, ఆవెంటనే పురోహితుడు చెప్పినది వట్టి బూటకము, అడిగినదానికి ఏదో ఒక జవాబు చెప్పకోవాలికదా అని చెప్పేశాడు కాని, వాడి మొహం వాడికి శాస్త్రమేమిటి తెలుసు?' అని రాజుగారూ, పరివారమూ తమలో తాము అనుకొని, ఇక అక్కడ నించి వారు పురోహితుణ్ణి ఇష్టమొచ్చినట్టూ వేళాకోళం చేయటానికి ప్రారంభించారు.

రాజు పురోహితుణ్ణి చూసి, హేళనగా నవ్వుతో, "ఏమండి శాస్త్రుల్లుగారూ, చచ్చిన వాళ్లెక్కడైనా తిరిగి రావటం విన్నారూ? ఆ కాపు చచ్చిపోతాడన్నారే! చూడండి, మోపుతో ఏలా వస్తున్నాడో! ఒక వేళ యమదూతలకు ఏమైనా లంచం పెట్టి చావు తప్పించుకున్నాడంటారా! లేకపోతే, 'పెళ్ళాం పిల్లలతో చెప్పిరాలేదు, వాళ్ళతో చెప్పకుండా చచ్చిపోతే వాళ్లు గోలపెడతారు కనుక చెప్పి వస్తాను' అని మృత్యుదేవతకు నచ్చ చెప్పి వస్తున్నాడంటారా? మాట్లాడవేమయ్యా! పాము కరిచి కాదూ చచ్చిపోతాడన్నావు! ఏమైందంటారు ఆ విషమంతా! ఇతగాడి చెమటకి కరిగి పోయిందా! లేక ఆ పక్షి మతి చెడిపోయి తప్పు చెప్పిందా? సెలవియ్యండి!" అన్నాడు. రాజుకుమల్లేనే తక్కినవాళ్లు కూడా ఆ శాస్త్రుల్లుని ఎగతాళి చేశారు. 'పక్షికి కాదు మతిపోత! శాస్త్రుల్లుకే!' అన్నాడు సేనాధిపతి.

ఆత్మవిశ్వాసంగల శాస్త్రి మాత్రం ఆ మాటలు వినిపించుకోలేదు. చెక్కు చెదరకుండా తిరిగి వస్తున్న ఆ కాపును చూసి, మనసులో ఇలా ఆలోచించుకొన్నాడు:

'నేటివరకు నేను చెప్పినమాట ఒక్కటీ పొల్లుపోలేదు, నా నోటివెంట ఏ మాట



వచ్చినా, అది అమోఘంగా జరిగితీరేటట్టు నా ఇష్టదేవత నాకు వరమిచ్చివున్నదే. ఆ ధైర్యంతో నేకదా నేను, జ్యోతిషమంటే గౌరవంలేని ఈ రాజువద్ద మసులుకు రాగలుగుతున్నాను. మరి, ఈ రోజున నా మాట ఫలించకపోవటానికి కారణ మేమై వుంటుంది?' అని అతనిమనసులో అనేకమయిన ఆలోచనలు పరిగెత్తినయి.

పోతున్న ఆ రైతును పిలిపించి, 'అబ్బీ, ఆ మోపు ఓమాటు దింపుకో చూద్దాం' అన్నాడు. వాడు 'ఎందుకు చెప్మా?' అనుకుంటూ, మోపు క్రింద పడేశాడు. 'మోపు విప్పు' అన్నాడు శాస్త్రుల్లు. 'ఏమిటో ఈ పరీక్ష?' అనుకుంటూ అందరూ చూస్తోండగా ఆ కాపు మోపు విప్పేడు. విప్పేటప్పటికి అందులో పాము తల ఒకటి, తోక ఒకటి కనపడ్డాయి!

'బాబోయ్!' అంటూ ఆ కాపు భయంతో ఒక్క గెంతు గెంతేడు. శాస్త్రి ఆ కాపుతో 'భయపడకోయ్. ఈ పాము నిన్ను చంపడానికొచ్చి, నీ కొడవలివల్ల తెగి చచ్చిపోయింది' అని ధైర్యం చెప్పాడు.

అప్పుడు పురోహితుడు తన మాట నెగ్గినందుకు విజయగర్వంతో రాజువేపు ఆయన పరివారము వేపు తిరిగి: "ప్రభూ! చూశారా శాస్త్రమంటె ఏమిటో, మహిమ అంటె ఏమిటో! విటియందు నమ్మిక లేని వాళ్ళను ఎంతకని శ్రమపడి నమ్మించగలము? ఇప్పుడు ఏలినవారు ప్రత్యక్షంగా పట్టువలతో కళ్ళారా చూచారు గనక సరిపోయింది. లేకపోతే శాస్త్రాలకు విలువ ఏమున్నది? ఇష్టముంటె నమ్మవచ్చు లేకుంటె మానెయవచ్చు కాని శాస్త్రాలను దూషించటంమాత్రం న్యాయంకాదు" అని చెప్పాడు.

శాస్త్రి చెప్పిన ఈ మాటలకు రాజు నిర్ఘాంతపోయాడు.

రాజు తొందరపడి పురోహితుణ్ణి హేళన చేసినందుకు పశ్చాత్తాపపడ్డాడు. ఆయనతో బాటు తక్కినవాళ్లుకూడా వెంటనే లెంపలు వేసుకున్నారు. కాని రాజుకీ వాళ్లకీ కూడా ఓసందేహం మాత్రం తీరలేదు. రాజుగారే అడిగేశారు: 'ఐతే శాస్త్రిగారూ, ఈరోజున వీడికి ఈ గండం తప్పిందీ అంటే ఏదో కారణం ఉండాలికద. అది ఏమంటారు?'

'ఉండాలి. వీడీ రోజున గొప్ప పుణ్యం ఏదో చేసి ఉండాలి...ఏమబ్బీ! ఈవేళ విశేషమేమైనా జరిగిందా?'

పురోహితుడు అలా అడిగేటప్పటికి ఆ కాపు "బాబూ, నేను గడ్డికోసం బయల్దేరి వస్తోంటే కొండ మొనవద్ద చెట్టుకింద ఓముసిలాయన ముక్కు మూసుకుని జపం చేసుకుంటున్నాడు. ఆయన్ని చూసేటప్పటికి బుద్ధిపుట్టి దణ్ణంపెట్టేను. ఆయన 'పదికాలాలపాటు బతుకు' అని నన్ను దీవించారు. అంతకన్న విశేషం ఏమీ జరగలేదు" అని చెప్పేడు. పురోహితుడు, "ప్రభూ, విన్నారుకదా. ఆ వృద్ధుడి దీవనవల్ల ఈ కాపు పాముగండం తప్పి బయటపడ్డాడు" అన్నాడు.

శాస్త్రికీ రాజుగారికీ కాపు నమస్కారాలు పెట్టి, మోపు నెత్తినపెట్టుకుని తన యింటికి చక్కా పోయాడు. పెద్దల దీవనలో ఇంత మహిమ ఉందని తెలుసుకొని రాజు నాటి నుంచీ పెద్దలంటే ఎంతో గౌరవంగా చూడడం మొదలుపెట్టేడు.

నాటినించీ మన పురోహితుని మాట అంటే రాజుకు పూర్తిఅయిన నమ్మకం కుదిరింది. మరి ఎన్నడూ జీవితంలో ఆయనను హేళన చేయలేదు. పురోహితునికే గాకుండా, తన్ను ఆశ్రయించి వచ్చే తక్కిన జ్యోతిష్కులకుకూడా ఆస్థానంలో మంచి సన్మానం జరుగుతూవుండేది.






పులీ, నక్కా యిలా మాట్లాడుకో సాగినై.

"పులిబావా, పులిబావా! నాకు రేపు పండగ. రాచకురుపుతో ఆరునెలలనుంచీ బాధ పడుతున్న చిలుకవాదిపట్నం రాజు కూతురు రేపు కడతేరుతుంది. నాకు మంచి విందు." అన్నది నక్క.

"నక్కబావా! ఈ రాచకురుపుకు మందే లేదా?" అన్నది పులి.

"లేకేం? ఈ దేవళంమీద ఏడాకుల మొక్క ఒకటి ఉన్నది. ఈ ఆకులు కురుపుమీద వేసికట్టి మూడోనాడు తీసి చూస్తే కురుపెక్కడ పుట్టిందో ఎవరూ కనుక్కోలేరు" అన్నది నక్క.

ఈమాటలు విన్న బాలుడు తెల్లవార గానే లేచి దేవళంఎక్కి దానిమీద ఉన్న మొక్కకుగల ఏడాకులూ కోసుకుని ధట్టీలో బిగించి కట్టి బారెడు పొద్దెక్కే వరకల్లా చిలుకవాదిపట్నం చేరి పూట కూళ్ళపెద్దమ్మ ఇంటికి వెళ్లాడు.

"పెద్దమ్మా, వరహా ఇస్తాను త్వరగా అన్నం వొండిపెట్టు" అన్నాడు బాలుడు.

"అయ్యో, నాయనా! ఇప్పుడు అన్నం వండేటట్టుగా ఉన్నదా? మా రాజు కూతురు రాచకురుపు లేచి కిందట్టూ మీదట్టూగా ఉంది. నేను త్వరగా అక్కడి కెళ్ళాలి. నువు ఇంకెక్కడైనా భోజనం చూసుకో" అన్నది పూటకూళ్ల పెద్దమ్మ.

"నాకు ఇంత తిండి పెడితే మీ రాజు కూతురి వ్యాధి నేనే నయం చేస్తాగా?" అన్నాడు బాలుడు.

"మహామహా వైద్యులు కుదర్చనిదాన్ని నువు కుదుర్చుతావా? అంతఆకలిగాఉంటే చద్ది అన్నంఉంది తిను" అంటూ పెద్దమ్మ బాలుడికి రాత్రి మిగిలిన అన్నం పెట్టింది.



"పెద్దమ్మా, నీతోకూడా నేను కోటలోకి వచ్చి రాజుకూతురుకు వైద్యం చేస్తాను. నన్ను తీసుకుపోతావా?" అని అడిగాడు బాలుడు.

పెద్దమ్మ సరేనన్నది.

అప్పటికే రాజకూతుర్ని కింద పెట్టేశారు. వైద్యులు నాడి క్షీణిస్తున్నదన్నారు. బాలుడు రాజుగారితో రాజుకూతురి పుండు చూపించమన్నాడు. మహా మహా వైద్యులు ఏమీ చేయలేక పోయినారు గాని ఈ కుర్రవాడు చేస్తాడా అని అనుకుంటూనే రాజుగారు బాలుడికి తన కూతురి పుండు చూపించాడు. బాలుడు ధట్టీలోనుంచి ఏడాకులూ తీసి, పుండు కడిగించి దాని మీద ఏడాకులూ వేసి కట్టు కట్టించాడు.

కింద పెట్టిన రాజుకూతురు ఎంతకూ చావలేదు. వైద్యులు నాడి చూసి, "ఇంకా ప్రాణం ఉంది. ఇవాళకు ఫరవాలేదు." అన్నారు. రెండోరోజు కూడా నాడి ఆడుతూనే ఉంది. రాజుకూతురు ఇంకోరోజు కూడా బతుకుతుందన్నారు వైద్యులు.

మూడో రోజు తెల్లవారి బాలుడు రాజు కూతురి కట్టు విప్పించాడు. కురుపు జాడ లేదు. అందరూ ఆశ్చర్యపోయినారు. "నిన్ను ఈశ్వరుడే పంపాడు. నువు సామాన్యుడివి కావు." అన్నాడు రాజుగారు బాలుడితో. ప్రజలంతా సంతోషం పట్టలేక బాలుణ్ణి చూడటానికి ఎగబడ్డారు. అందరూ చూడగలందులకు రాజుగారు తన కుమార్తెనూ, బాలపద్దిరాజునూ పల్లకీలో ఎక్కించి మేళతాళాలతో ఊరు అన్ని వీధులా ఊరేగించాడు.

పదిహేను రోజులు బాలుడు రాజుగారింట గడిపి, శలవు ఇప్పించమని అడిగాడు.

"నాయనా, నా కూతుర్ని బతికించావు. దాన్ని నువే పెళ్ళాడు" అన్నాడు రాజు.



బాలుడు తన వృత్తాంతమంతా చెప్పి, "నాగళ్లపూడి గట్టున మాయలఫకీరు చెరలో ఉన్న మా అమ్మను విడిపించి వచ్చేటప్పుడు నేను మీ అమ్మాయిని పెళ్ళాడుతాను." అని రాజుగారిచ్చిన నగలూ అవీ పుచ్చుకొని బయలుదేరి నయనవాడిపట్నం చేరాడు. అక్కడ భోం చేసుకుని నాగళ్ళపూడి గట్టుకు వచ్చాడు. దూరాన మసీదు కోట కనిపిస్తున్నాయి.

"ఆ మసీదులోనేగదా మా అమ్మ చెర ఉన్నది! ఆ కోటచుట్టుగదా మాతండ్రులు శిలలైనారు!" అనుకున్నాడు బాలుడు.

బాలు డీవిధంగా నాగళ్ళపూడిగట్టు సమీపిస్తూ ఉండగా, మాయలఫకీరు ఆ గట్టుమీద కాపలా ఉంచిన పొలిమేరశక్తి అతన్ని చూసింది. పదహారేళ్ళ బాల కుమార్తె వేషం ధరించి తక్కుతూ తారుతూ ముసిముసినవ్వులు నవ్వుతూ బాలుడికెదురుగా వచ్చింది. ఆ వచ్చేది తనను చంపటానికి మాయలఫకీరు ఉంచిన పొలిమేరశక్తి అని బాలుడు వెంటనే గ్రహించి అది దగ్గిరికి రాగానే తన మొలలో ఉన్న బాకు తీసి దాన్ని చంపబోయినాడు.



పాలిమేరశక్తి గడగడా వొణుకుతూ "అయ్యో, నన్ను చంపకు. నీకు మీ అమ్మ కనిపించే ఉపాయం చెబుతాను" అన్నది.

"ఉపాయం చెబితే నిన్ను ప్రాణాలతో వొదుల్తాను." అన్నాడు బాలుడు.

"ఈ నాగళ్ళపూడి గట్టుమీద తంబళ్ళ పెద్ది ఉన్నది. అది ఫకీరుకు దండలు కడుతుంది. దాని ఇంటికి పోయి దాహం అడుగు. ఎవరబ్బాయీ నువు అని అడిగితే మీ తండ్రిపేరు తంబళ్ల శరబయ్య అనీ, మీ తల్లిపేరు నాగమ్మ అనీ, నీపేరు వీరయ్య అనీ చెప్పు. మీ అమ్మా నాయనా చచ్చిపోయారని కూడా చెప్పు. ఆతర్వాత నీకు మీ అమ్మ కనిపిస్తుంది," అని చెప్పి పాలిమేరశక్తి బాలుడికి తన చేతి బెత్తం ఇచ్చింది.

బాలవర్ధిరాజు తంబళ్లపెద్ది ఇంటికి పోయి పాలిమేరశక్తి చెప్పినట్టే చేశాడు. "అయ్యో, మనమడా!" అంటూ తంబళ్ళ పెద్ది బాలుణ్ణి కౌగిలించుకున్నది.

"మీ అమ్మా, నాన్నా కులాసాగా ఉన్నారా నాయనా?" అని అడిగింది తంబళ్లపెద్ది.

"ఇద్దరూ చచ్చారు" అన్నాడు బాలుడు.

తన కూతురూ, అల్లుడూ చచ్చారని వినగానే పెద్ది చాలా విచారించి మనమణ్ణి తనదగ్గిరే ఉండమన్నది.

తంబళ్లపెద్ది రోజూ మాయలఫకీరుకు దండలు కడుతుంది. బాలుడు, "అవ్వా, నేనుకూడా మంచి దండలు కడతాను" అన్నాడు.

"కట్టు, నాయనా," అన్నది పెద్ది.

బాలుడు మాయలఫకీరు మనసు రంజించేటట్టుగా పెద్ద పెద్ద దండలు, రకరకాల ఆకారాలలో కట్టాడు. తన తల్లి బాలనాగమ్మ కని ఒక దండ చిక్కొరి



బిక్కరిగా కట్టి అందులో తన వేలి ఉంగరం ఉంచాడు. వాటన్నిటినీ తంబళ్ల పెద్ది కిచ్చి పంపాడు.

దండలు చూసి మాయలఫకీరు చాలా సంతోషించి ఎవరు కట్టారని అడిగాడు. నా కూతురి కొడుకు కట్టాడని చెప్పింది పెద్ది. వాడు మూడు రోజులయి పడమట నుంచి వచ్చాడన్నది.

మాయలఫకీరు పెద్ది జీతం పెంచి, పిల్లవాడికి బాగా భోజనం పెట్టి చక్కగా పెంచమన్నాడు.

తంబళ్ళపెద్ది బాలనాగమ్మ మేడకు వచ్చి ఆమె దండ ఆమెకిచ్చింది. "నాకు దండలే తక్కు వయాయా?" అంటూ బాలనాగమ్మ పెద్ది ఇచ్చిన దండను గిర వాటు వేసింది. దండ గోడకు తగిలి ఉంగరం కింద పడింది.

ఆ ఉంగరం చూడగానే బాలనాగమ్మ గుర్తుపట్టి తన కొడుకును చూసినట్లే సంతో షమూ, దుఃఖమూ పట్టలేక పెద్దపెట్టున ఏడుస్తూ, "నా తండ్రీ, నువు పంపించావా ఈ ఉంగరం? నువు వచ్చావా? నువెం దుకు వచ్చావురా తండ్రీ? నిన్నీ మాయ ముండాకొడుకు బతకనిచ్చేనా! ఈ పాప ఖర్ముడు నీ తండ్రులనందర్నీ తన పొట్టన పెట్టుకున్నాడే!" అని తనలో అనుకుని, ఉంగరం తన చేతికి పెట్టుకుంది.

బాలుడు ఆ రోజు కారోజు మంచి దండలు, అంతస్తులు అంతస్తులుగా కట్టి ఫకీరును మెప్పించసాగాడు. ఒకనాడు ఫకీరు పెద్దితో "పెద్దూ, నువు నీ మనవణ్ణి తెచ్చి నాకు చూపించు" అన్నాడు.

మర్నాడు దండలు తెచ్చేటప్పుడు, తంబళ్ళపెద్ది బాలుణ్ణి ఫకీరువద్దకు వెంట బెట్టుకుని వెళ్లింది. ఫకీరు కుర్రవాణ్ణి చూసి చాలా సంతోషించి, ఒరే అబ్బాయీ! నువు దండలు బాగా కడతావు. నీకు ఏనుగలా



"అరే, దర్వాజాలు మంత్రంతో బిగించి ఉన్నాయిరా? ఎట్లా తెరుచుకుంటాయి? పోనీ ఆ మంత్రాలు నీకు చెబుతాను. వెళ్లి మసీదు చూసి రా!" అని మాయలఫకీరు బాలుడికి మసీదు తలుపులు తెరిచి మూసే మంత్రాలన్నీ చెప్పాడు.

బాలవర్ధిరాజు మసీదులో అడుగుపెడుతూనే మూర్తీభవించిన ఒక దేవతవలె కూర్చున్న తన తల్లిని చూసి, అడుగులో అడుగు వేసుకుంటూ ఆమెను సమీపించాడు.

గుర్రాలా? ఏం కావాలి, కోరుకో" అన్నాడు.

"అయ్యా నాకవన్నీ దేనికి? నీదగ్గిర పన్నెండు స్తంభాల మసీదున్నదట. అది చాలా అద్భుతంగా ఉందట. దాన్ని నాకు చూపిస్తే సంతోషిస్తాను" అన్నాడు బాలుడు.

"అరే, ఆ మసీదులో పానుగంటి బాల నాగమ్మ వ్రతం చేస్తున్నదిరా. ఆ వ్రతం అయేదాకా నేను మసీదులో అడుగుపెట్ట రాదు. మరేదన్నా కోరుకో!" అన్నాడు మాయలఫకీరు.

"అయ్యా, నువు రాకపోతే, నన్నే వెళ్లి చూసి రానివ్వరాదా?" అన్నాడు బాలుడు.

బాలనాగమ్మ తల ఎత్తి అతన్ని చూడలేదు. ఆ వచ్చేది మాయలఫకీరేనని ఆమె నమ్మకం. బాలుడి పాదాలు ఇంకా అంతదూరంలో ఉండగానే ఆమె, "ఓరీ, ఫకీరూ! ఇంక ఒక్క అడుగు ముందుకువచ్చావా, తల పగిలి చస్తావు!" అన్నది.

దానికి బాలుడు, "అమ్మా! నేను మాయలఫకీరును కానమ్మా! నీ కొడుకు బాలవర్ధిరాజును! నాకేసి చూడు!" అన్నాడు.

బాలనాగమ్మ అనుమానంతో తల పైకెత్తి చూసి, "ఏమో ఎట్లా నమ్మటం?

ఫకీరు మాయవేషా లెన్నయినా వేస్తాడు,' అన్నది.

"నేను నీ కొడుకునే! ఫకీరుముండా కొడుకును కడతేర్చి నిన్ను రక్షించటానికి ఎన్నో శ్రమలుపడి వచ్చాను. నా ఉంగరం కూడా నీకు తంబళ్లపెద్దిచేత పంపించాను. త్వరగా తిరిగి పోకపోతే ఫకీరు అనుమానిస్తాడు. నేను నీతో మాట్లాడాలిసి ఉంది. అనుమానంతో కాలం వ్యర్థం చెయ్యొద్దమ్మా." అని బాలుడు బతిమాలాడు.

ఈ మాటతో బాలనాగమ్మ సందేహం తీరింది. ఆమె చివాల్నలేచి తన కొడుకును కావిలించుకుని, చంటిబిడ్డను ముద్దులాడినట్టు ముద్దులాడింది. ఆమెకు సంతోషమూ దుఃఖమూకూడా పొంగి వచ్చాయి.

"నాయనా, పసివాడివి. మన పన్నెండు వేల బలగాన్నీ రాళ్లగుట్టలుచేసి పారేసిన ఈ ఫకీరును నువ్వెట్లా జయిస్తావురా? ప్రాణాలు దక్కించుకుని ఇంటికి తిరిగిపో. నేను నీ కెక్కడి తల్లిని? నిన్ను పెంచి పెద్దచేసిన ఆ ఆరుగురు అక్కచెల్లెళ్ళే నీ తల్లులు! పో, నాయనా, పో. కంటికి అపుపించావు, చాలు!" అని ఏడవసాగింది.



బాలుడు ఆమెను కష్టపడి ఊరడించి ఆమెకు రహస్యంగా ఒక ఆలోచన చెప్పి, తల్లిదగ్గిర సెలవు పుచ్చుకొని, మసీదు తలుపు మళ్లీ మూసేసి ఏమీ ఎరగనట్టు ఫకీరుదగ్గిరికి వచ్చేశాడు.

"ఏం, కుర్రాడా? ఎట్లా ఉంది మసీదు?" అన్నాడు ఫకీరు.

"అయ్యా, ఆ మసీదు అందంచూస్తే ఇక ఆకలిదప్పులుకూడా తెలియలేదు. విడిచి రాలేక, రాలేక వచ్చేశాను" అన్నాడు బాలుడు.

ఫకీరు నవ్వి, "పిచ్చివాడా, మసీదు చూస్తే కడుపు నిండుతుందా? బాగా

భోంచెయ్యాలి, కడుపునిండాలి. రాజ్యం చేయాలి, సుఖపడాలి," అన్నాడు.

బాలుడు తంబళ్ల పెద్దితో సహా ఫకీరు దగ్గిర సెలవుపుచ్చుకొని తిరుగ ఇంటికి వచ్చేశాడు.

మర్నాడు బాలనాగమ్మ పెందలాడే లేచింది. తలంటి పోసుకున్నది. నగలన్నీ పెట్టుకుని చక్కగా అలంకరించుకున్నది. తాంబూలం వేసుకున్నది. ఫకీరుకోసం పెద్దెత్తుగా వంట తయారు చేయించింది. ఫకీరు పూలతోటకు షికారు పోయి తిరిగి వచ్చే సమయంకోసం కాచుకుని ఉండి, వాణ్ణి భోజనానికి ఆహ్వానించింది.

ఫకీరు బాగా భోంచేసి, కల్లూ, సారాయీ తాగి, నల్లమందు వేసి, గంజాయిచిలుంపట్టి మంచి హుషారుగా ఉన్న సమయంలో తంబళ్లపెద్ది గొప్పగొప్ప పూలదండలుతెచ్చి ఫకీరుదగ్గిర పెట్టిపోయింది. ఇంతలో బాలనాగమ్మ పాముకూసంలాంటి చీరెగట్టి, నగలతో ధగధగలాడుతూ, తాంబూలం నములుతూ, మందగమనంతో, నవ్వు ముఖంతో ఫకీరుదగ్గిరికి వచ్చి నిలబడింది.

[ఇంకా వుంది]






పూర్వకాలమందు ఒక గొల్లపిల్లవాడు ఉండేవాడు. వాడు పొద్దుటల్లా పశువులను మేపి, మధ్యాహ్నంపూట విశ్రాంతికోసం, వాటిని ఒక రావిచెట్టు నీడకు తోలుకు పోయేవాడు.

ఇలా కొంతకాలం జరిగినాక ఒక చిత్రం జరిగింది. ఒకనాడు వాడు రావి చెట్టుక్రింద కూర్చుని సేదతీర్చుకుంటూ వుండగా "అబ్బాయీ! నా మొదట్లో నీవు రోజూ పాలు పోసినావంటే నీకు గొప్ప మేలు కలుగుతుంది" అని రావిచెట్టు చెప్పినట్లు వినపడింది. నాటినించీ వాడు తన మందలో పశువుల పాలు పితికి, రావిచెట్టు మొదట్లో పోస్తూవుండేవాడు.

అలా వాడు చెట్టు మొదట్లో పాలు పోయగా పోయగా, కొన్నాళ్లకు పటాలు మని నేల బద్దలై ఒక పెద్ద నాగుపాము పడగ ఎత్తుకుని, ఆ బీటలోనించి చరచరమంటూ వచ్చేసరికి, గొల్లపిల్లవాడు హడిలిపోయాడు.

'నాయనా! నీకు వచ్చిన భయమేమీ లేదు. హడిలిపోబోకు, కొందరు దుర్మార్గులు నన్ను నిష్కారణంగా ఈ చెట్టుకింద గొయితీసి పాతిపెట్టారు. అందు చేత చావ సిద్ధమైనాను. ఇంతలో నీ ధర్మమా అని పాలు పోయటం చేత నేను తేరుకున్నాను. మళ్లీ జీవం చేరుకున్నది. ఎన్ని జన్మలు ఎత్తితేమాత్రం నీవంటి ప్రాణదాత ఋణం తీర్చుకొనగలనా? అయినా ఏదో ఉడతాభక్తిగా ఒక చిన్న వరం ఇస్తాను,' అని నాగుపాము వానిని దగ్గరగా రమ్మన్నది.

అతను చేరువకు రాగానే, తలపైన ఊది, "అబ్బాయీ! నా మహిమవల్ల నీ తలవెంట్రుకలు బంగారు వెంట్రుకలుగా మారిపోతాయి. ఇందువల్ల నీకు చక్కటి

విశ్వం, మద్రాసు



ఒకనాడు గొల్లపిల్లవాడు నదిలో స్నానం చేసి. తుడుచుకుంటూ వుండగా, తళతళ మెరసిపోతూ పన్నెండు నిలువుల పొడవు గల ఒక బంగారు తలవెంట్రుక ఊడి వచ్చింది. ఉత్సాహం పట్టలేక, అతను ఆ తలవెంట్రుకను ఒక ఆకులో జాగర్తగా పొట్లం కట్టి, నీటిపైన వదలిపెట్టాడు.

దిగువ రేవులో స్నానమాడుతున్న ఒక రాజకుమారికి గొల్లపిల్లవాడు వదిలిపెట్టిన ఆకుపొట్లం దొరికింది. ఆత్రంకొద్దీ ఆమె పొట్లం విప్పి చూచేసరికి, అందులో పన్నెండు మూరల బంగారు తలవెంట్రుక తళతళమని మెరుస్తూ కనిపించింది.

ఆమె ఆ తక్షణమే తండ్రివద్దకు వెళ్లి, "నాన్నగారూ! నేను ఇలాంటి బంగారు తల వెంట్రుకలు కల 'మనిషినే పెళ్లి చేసుకుంటాను. లేని పక్షంలో పెళ్లే చేసుకోను" అని తన నిశ్చయాన్ని తెలిపింది.

ఈ విడ్డూరం విని, రాజూ రాణీ ఆశ్చర్యపోయారు. బంగారు తలవెంట్రుకలు గల చిన్నవానికోసం వారు, కోటలో పరివారమంతటినీ పంపించారు. అటువంటి చిన్నవాడు దొరకలేదని చెప్పి వాళ్లందరూ

భార్య దొరుకుతుంది. పైగా, నువ్వు ఏమాట అంటే ఆ మాట ప్రకారం జరిగి తీరుతుంది. నువ్వు అదృష్టవంతుడివి. వెళ్లు' మని దీవించింది. ఆతర్వాత యిలా హెచ్చరించింది: 'ఈ వరం పొందిన సంగతి బ్రహ్మ రుద్రుడుకి కాదుకదా, ప్రియమైన భార్యకు సయితం తెలియనీయకూడదు. అలా జరిగితే ఆక్షణమందే మహిమ అంతరించి పోతుంది సుమా' అంటూ గొల్లపిల్లవానిని నాగుపాము హెచ్చరించింది. గొల్లపిల్లవాడు సంతోషించి యింటికి వచ్చేశాడు.

* * *

తిరిగివచ్చారు. గూఢచారుల్ని నలుమూల లకూ పంపించారు. వాళ్ళూ తెల్లముఖం వేసుకొని తిరిగివచ్చారు. ఇది పనికాదని, మహిమగల సాధువులను దేశదేశాలకు పంపారు. వాళ్లూ తిరిగి తిరిగి వచ్చి, లాభం లేదనేశారు.

చివరకు ఒక రామచిలుక, "మహా రాజా! బంగారు తలవెంట్రుక గల చిన్న వానిని మేము పట్టవలిసిందేగాని మానవు లకు శక్యమవుతుందా? నన్ను పంజరం లోనించి వదిలిపెట్టండి. నిమిషంలో ఆ చిన్నవానిని పట్టితెస్తాను. నా ప్రజ్ఞ చూద్దురుగాని," అని చెప్పింది.

వెంటనే, రామచిలుకను పంజరంలో నించి విడిచిపెట్టి దానికి విందు చేసి, ప్రయాణం కట్టారు. అది నదులూ పర్వతాలూ దాటుకుని, అడవుల మధ్య నున్న గొల్లపిల్లవానిని కనిపెట్టింది. అప్పుడది చేసిన చిత్రం ఏమిటనుకున్నారు! ఒక్కొక్క పశువుమీదినించే మెల్లిగా ఎగురుతూ వెళ్లి, ఆదమరపుగా వున్న గొల్లపిల్లవాని చేతిలో పిల్లనగ్రోవి నోట కరచుకొని చెట్టుమీదకి ఎగిరి పోయింది.



గొల్లపిల్లవాడు పిల్లనగ్రోవి కోసం చిలుకను వెంబడించి రాసాగాడు. అది అలా చెట్టుమీదినించి చెట్టుకి, చెట్టుమీది నించి చెట్టుకి ఎగిరి పోతూ, రాజకుమారి అంతఃపురంలోనికి దారితీసింది. ఆత్రంతో వున్న గొల్లపిల్లవాడు, తన పశువుల సంగతే మరిచిపోయి, చిలుక వెనుకనే వెళ్లి అంతఃపురంలో ప్రవేశించాడు.

తన పని నెరవేరిందనే సంతోషంతో నోటినున్న పిల్లనగ్రోవి రాజకుమారి ఒడిలో పడవేసి, రామచిలుక ఎగిరిపోయింది.

గొల్లచిన్నవాడు తన పిల్లనగ్రోవి తన కిమ్మని రాజకుమారిని అడిగాడు. అందు

కామె "నన్ను పెళ్లాడుతే ఇస్తాను, లేక పోతే ఇవ్వను" అన్నది. అతనికి ఆశ్చర్యం కలిగింది. 'స్వయంవరం లేకుండా, ప్రధానం లేకుండా ఇంత హఠాత్తుగా పెళ్లి యేమిటి!' అని ప్రశ్నించాడు.

'స్వయంవరమూ, ప్రధానమూ అన్నీ నదిలో నాకు పొట్లం దొరికిన నాడే నిశ్చయమయినయి' అని అంటూ, ఆమె తనకు దొరికిన ఆకుపొట్లం చూపించింది.

ఇదంతా తనకు వరమిచ్చిన నాగుపాము మహిమ కదా అని అప్పుడు గొల్లచిన్న వానికి జ్ఞాపకం వచ్చి, అతను పెళ్లికి ఒప్పుకొన్నాడు. కొద్ది రోజులకే, వారిద్దరికీ అతివైభవంగా వివాహమయింది. ఆ రాజు తన కుమార్తెనే కాకుండా, అర్ధరాజ్యం కూడా అతనికి ఇచ్చి ఏలుకోమన్నాడు.

గొల్లచిన్నవానికి అదృష్టం పండి, హాయిగా కాలక్షేపం చేస్తూవున్నాడు. కొన్నాళ్లకు తను అడవిలో విడిచిన పశువుల మంద సంగతి గుర్తు వచ్చింది. ఆ మట్టున అతను బయల్దేరి పోబోతూండగా అతని భార్య కూడ వెంట వస్తానన్నది.

ఇద్దరూ కలిసి ఆ అడవుల మధ్యకి వెళ్లేసరికి, పశువుల మందలో ఒక్కటీ మిగలకుండా చచ్చి పడివున్నాయి. అయితే నాగుపాము తన కిచ్చిన రెండవ వరం అతనికి జ్ఞాపకం వచ్చింది. అప్పుడు అతను 'నాపశువులు బతకాలి!' అని మనస్సులో కోరుకున్నాడు.

వెంటనే పశువు లన్నీ తోకలాడిస్తూ, గభాలునలేచి నిలుచున్నాయి. అపరిమిత మయిన సంతోషముతో వారు పశువుల మందను తమ రాజ్యానికి తీసుకుపోయారు.

మాటయందు గురి ఉన్నవాళ్లకూ, మంచితనం కలవాళ్లకూ ఎప్పటికైనా మేలు కలుగుతుంది.





# అన్నదాన మహిమ

పూర్వం ఓ బ్రాహ్మణు డుండేవాడు. వేళగాని వేళ తనయింటికి ఎవరువచ్చినా వాళ్లను తను ఎరగకపోయినాసరే, ఆదరించి భోజనం పెట్టేవాడు. ఒకవేళ ఇంటికెవరూ రాకపోతే, వీధివెంట పోయే వాళ్ళని పిలిచి అన్నం పెట్టేవాడు. ఇలాగ చాలాకాలం జరిగేక, ఒకనాడాయనకు అన్నదానంవల్ల వచ్చే పుణ్యం ఎలాంటిదో తెలుసుకోవాలని బుద్ధి పుట్టింది. ఎవళ్ళను అడిగినా చెప్పలేకపోయారు.

ఒకాయన ఏమన్నాడంటే, "అన్నదాన మహిమ చాలా గొప్పది. దానిని వర్ణించాలంటే, కాశీఅన్నపూర్ణకు తప్ప ఇతరులకు సాధ్యంకాదు. మీకు తెలుసుకోవాలని ఉంటే, స్వయంగా ఆ అన్నపూర్ణాదేవినే అడిగితెలుసుకోండి" అని సలహా ఇచ్చాడు.

అన్నపూర్ణ అంటే కాశీ విశ్వేశ్వరుని భార్య ఐన పార్వతీదేవి అన్నమాట. ఆవిడకు కూడా అన్నదానమంటే ఎంతో ఆసక్తి. అందుకనే కాశీలో ఎవరికీ అన్నం లేకుండాపోదు. మన బ్రాహ్మడు కాశీ వెళ్లి గంగ ఒడ్డున కూచుని పార్వతీ దేవిని గురించి గాఢంగా తపస్సు చేయసాగాడు.

దేవి అతని తపస్సుకు మెచ్చుకుని ప్రత్యక్షమై 'నీకేంకావాలి?' అని అడిగింది.

బ్రాహ్మడు సాష్టాంగనమస్కారం చేసి, "అన్నపూర్ణాదేవీ, నాకేమీ కోరిక లేదు. కాని, అన్నదాన మహిమ ఎటువంటిదో తెలుసుకోవాలని నేను మిమ్మల్ని గురించి తపస్సు చేశాను. ఈసంగతి మీరే చెప్పాలి గాని ఇతరులవల్ల కాదు" అని తన మనసులో వుద్దేశం వెల్లడించాడు.

అప్పుడు దేవి అతనితో "నీకు అన్నదాన మహిమ తెలియాలీ అంటే నేను చెప్పటం కాదు; అది నీవు తెలుసుకునే ఉపాయం మాత్రం చెబుతాను, విను: హిమవ

పాలంకి వెంకట రామచంద్రమూర్తి, మద్రాసు.



త్పర్వతం దగ్గర హేమవతమని ఒక పట్టణం ఉంది. ఆ పట్టణాన్ని ఏలుతున్న రాజుకి పిల్లలు లేరు. నువ్వాయనదగ్గరకు వెళ్లి ఆయనకి కొడుకు పుట్టాలని దీవించు. ఆ రాజు సంతోషించి, 'బాబూ మీకేం కావాల'ని అడుగుతాడు. అప్పుడు నీవు, 'నాకు పెద్ద కోరిక ఏమీ లేదు. నీకు కుమారుడు పుట్టిన తక్షణమే ఆ పిల్లవాణ్ని నేను చూడాలి. ఆ సమయంలో పిల్లవాడి దగ్గర రాణీకూడా ఉండకూడదు' అని చెప్పు. 'ఇంతేగదా?' అని రాజు అందుకు ఒప్పుకుంటాడు. ఆ పిల్లవాడు పుట్టడంతోనే ఏకాంతంగా వాణ్ని 'అన్నదానంవల్ల కలిగే పుణ్యమేమిటిరా అబ్బాయి?' అని అడిగి తెలుసుకో" అని చెప్పింది.

బ్రాహ్మణుడు 'సరే' అని చెప్పి హేమవతానికి బయలుదేరి వెళ్లేడు. దారిలో ఒక అడవి అడ్డమైంది. అందులో ప్రవేశించి వెడుతూ అతడు దారి తప్పిపోయాడు. దారితెలియక తచ్చాడుతోంటే, ఆ అడవిలో ఉండే బోయవాడొకడు ఆయన అవస్థ కనిపెట్టి "ఏం బాబూ, దారి తప్పిపోయినట్టున్నారు. ఏ ఊరు వెళ్లాలి?" అని ఆత్రముతో అడిగాడు.

'హేమవత పర్వతం దగ్గరికి పోవాలి' అన్నాడు బ్రాహ్మడు.

"బాబూ, దారితప్పి ఆమడ దూరం వచ్చేశావు. సాయంత్ర మయిపోయింది. పులులూ, సింహాలూ ఉన్న అడవి ఇది. రాత్రిప్రయాణం చెయ్యకూడదు. పొద్దున్నే దారి చూపిస్తాను. ఈ రాత్రి ఆగిపొండి" అన్నాడు బోయవాడు.

బ్రాహ్మడు రాత్రికి అక్కడ ఉండిపోవటానికి ఒప్పుకోగానే బోయవాడు ఆయనను తన చేనువద్దకు తీసుకెళ్లేడు.

చేనుదగ్గరకు వెళ్ళటంతోనే బోయవాడు తన యింటికి అతిథిగా వచ్చిన ఆ

బ్రాహ్మణుడికి భోజనం ఏం పెడితే బాగుంటుందీ అని ఆలోచించాడు. అనప కాయలూ, కందికాయలూ, పెసర కాయలూ కావలసినన్ని ఉన్నాయిగాని వాటిని ఉడకేసుకోమని ఇవ్వటానికి వాడి వద్ద కొత్తకుండ లేకపోయింది. తమ కుండల్లో ఉడకేసి పెడితే ఆయన తినడు. ఎలాగ మరి? అని ఆలోచించాడు.

బ్రాహ్మడు, 'నాయనా, నాకేమీ వద్దోయ్. నువ్వు చేసిన ఆదరణవల్ల నా శ్రమా, ఆకలీ కూడా తీరిపోయాయి. ఆలోచించక పడుకో' అన్నాడు. కాని బోయవాడికి ఆ బ్రాహ్మణ్ణి పస్తుపెట్టడమంటే మనస్సు ఒప్పిందికాదు. అందుచేత ఇంత చారపప్పూ పట్టు తేనే తెచ్చి ఇచ్చి, వాటితో ఆకలి తీర్చుకోమన్నాడు.

బ్రాహ్మణుడు అవి తీసుకొని, అంగోస్త్రం పరుచుకుని, కింద పడుకోబోతూంటే, బోయవాడు, 'అయ్యో, కిందపడుకో బోకండి. పులులు వస్తాయి' అని చెప్పి, ఆయనని చెలో ఎత్తుగా ఉన్న మంచెమీద పడుకోబెట్టి, తాను కింద ఉండి, విల్లూ, అమ్ములూ పుచ్చుకుని మృగాలేవీరాకుండా రాత్రంతా బ్రాహ్మడికి కాపలా కాశాడు.



బోయవాడలా నిద్రపోకుండా రాత్రంతా కాపలా కాశాడు కాని, తెల్లవారుఝామున నిద్ర ఆగక ఒక్క కునుకు తీశాడు. అంతలో ఎక్కడనుంచో ఓపులి వచ్చి, పాపం అ బోయవాడిమీద పడి చంపేసింది.

బ్రాహ్మణుడు నిద్రలేచి, జరిగినదంతా తెలుసుకుని, తనమూలాన ఆ బోయవాడు పులివాత బడ్డాడని ఎంతో విచారించాడు. బోయవాని భార్య బ్రాహ్మణునితో "స్వామీ, నా రాత ఇలా ఉండగా ఎవరు తప్పించ గలరు? మీరు విచారించకండి. మిమ్ము హిమవతానికి దారి చూపిస్తాను, నడవండి" అని, ఆయనను తీసికెళ్లి దారి చూపెట్టి,

వెనక్కి తిరిగివచ్చి, భర్తతోపాటు సహగమనం చేసింది.

ఆ బ్రాహ్మణుడు బోయదంపతుల మంచితనాన్ని తలుచుకుంటూ హేమవతాన్ని చేరుకున్నాడు. అక్కడ రాజును చూచి పార్వతీదేవి చెప్పినట్లుగా దీవించాడు. 'పుట్టినప్పుడు మీపిల్లవాణ్ణి ఏకాంతంగా చూడడానికి అనుమతి ఇవ్వాల'ని కోరగా రాజు అందుకు ఒప్పుకున్నాడు.

రాజుగారి భార్య తొమ్మిది నెలలూ మోసి, చందమామలాంటి పిల్లవాణ్ణి కన్నది. బ్రాహ్మణుడు ఎవరూ లేకుండా చూసి ఆ పిల్లవాణ్ణి, 'అన్నదానంవల్ల కలిగే ఫలమేమిటో చెప్పు' అని అడిగేడు.

అప్పుడే పుట్టిన శిశువైనప్పటికీ పెద్దవానికి మల్లే ఆ పిల్లవాడు బ్రాహ్మణునితో యిలా అన్నాడు: "పదినెలలక్రితం మీరీ పట్టణానికి వస్తూ అడవిలో దారి తప్పిపోతే, మిమ్మల్ని తీసుకెళ్లి చారెడు చారపప్పూ, పురిషెడు తేనే ఇచ్చిన బోయవాణ్ణి నేనే సుమండీ! ఈమాత్రపు దానానికే ఈ రాజుగారికి కుమారుణ్ణయి పుట్టి, రాజ్యమేలబోతున్నాను. ఒకనాటిదానానికే ఇంత గొప్పఫలం కలిగినప్పుడు, నిత్యం అన్నదానంచేసే మహానుభావులకు ఎటువంటి ఫలం కలుగుతుందో మీరే ఊహించుకోండి."

ఇలా చెప్పేసి, ఆ పిల్లవాడు మరుక్షణంలోనే ఏమీ ఎరుగని పసిపాపలాగ 'కువ్వా, కువ్వా' అని ఏడవడం అరంభించాడు.

బ్రాహ్మణుడు చాలా ఆశ్చర్యపడి, తన వూరు తిరిగివచ్చి జరిగినదంతా భార్యతో చెప్పేడు. ఆ దంపతులు అప్పటినించీ విడవకుండా అన్నదానంచేస్తూ ధనధాన్య సమృద్ధీ, పుత్రపౌత్రాభివృద్ధీ కలిగి సుఖంగా ఉంటున్నారు.






# వంచక మహాపట్టణం

పూర్వకాలమందు సింహళదేశంలో ఒక ఓడవర్తకుడు ఉండేవాడు. అతనికి జయపాలుడు అని ఒక్కడే కుమారుడు. ఆ వర్తకునికి అవసానకాలం రావటంచేత కొడుకును చేరబిలిచి, "నాయనా! నా తరవాత నీవుకూడా మనకు తరతరాల నించి వస్తూవున్న ఓడవర్తకం సాగించి, గొప్పవాడవయి, పేరుప్రతిష్ఠలు నిలుపుకోవలిసింది. అయితే — నీకు చెప్పవలసిన విషయం ఒక్కటే ఉన్నది; ఎన్నిదేశాలు తిరిగినా ఫరవాలేదు కాని, వంచకమహాపట్టణం మాత్రం పోబోకు సుమా" అని హెచ్చరించాడు.

తండ్రిని సంతోషపెట్టటానికని జయపాలుడు 'సరే' నని తల వూచాడు. మరి కొద్దిరోజులకే వర్తకుడు మరణించాడు. తండ్రి చనిపోగానే జయపాలుడు స్వతంత్రుడయినాడు. ఇప్పుడు అతనికి అటంకమేమీ లేదుగా? కనుక జయపాలుడు తన ఇష్టము వచ్చిన చోటికి వెళ్ల వచ్చునని సంతోషించాడు.

ఏ పట్టణానికయితే తండ్రి తనను పోవద్దు అని హెచ్చరించాడో, ఆ వంచక మహాపట్టణానికే పోయి చూడాలని జయపాలునికి బుద్ధి పుట్టింది. ఈ వుద్దేశంతో, నాలుగు ఓడలనిండా విలువయిన సరకు వేసుకొని, అతను వ్యాపారం నిమిత్తం బయలుదేరాడు.

తొమ్మిది పగళ్లు, తొమ్మిది రాత్రిళ్లు, సముద్రంమీద ప్రయాణంచేసి, జయపాలుడు వంచకమహాపట్టణం చేరుకొన్నాడు. ఆ పట్టణపు రేవుదగ్గర ఒక పల్లెవాడు చేపలను పట్టుతూ వున్నాడు. ఆ చేరువనే ఒక నీటికొంగ సముద్రంలో మునుగుతూ, తేలుతూ చేపలను పట్టి తింటూవున్నది. విలువిద్యలో నేర్పరి

లింగం నాగేశ్వరరావు, పెదననగల్లు




అయిన జయపాలుడు తన బాణంతో ఆ నీటికొంగను కొట్టివేశాడు.

నీటికొంగ చచ్చి నీళ్లమీద తేలుతూ వుండేసరికి, పల్లెవాడు పరుగెత్తుకువచ్చాడు. 'ఏమిటయ్యా అబ్బాయీ, ఈ అన్యాయం! చచ్చిపోయిన నా తండ్రి నీటికొంగ రూపం దాల్చి, నాకు చేపలను పట్టడం నేర్పుతూ వుంటే, నువు వచ్చి అకారణంగా అతనిని చంపి, నాకు అపకారం చేశావు. రాజుగారి వద్దకు పద. నీపయిన ఫిర్యాదుచేయాలి" అన్నాడు.

రాజుగారు నేరం విచారణ చేసి, పల్లెవానికి జయపాలుడు ఒక ఓడను నష్ట పరిహారంగా ఇవ్వవలెనని తీర్పు చెప్పారు. జయపాలుని నాలుగు ఓడలలోనూ ఒక ఓడ పోయింది.

ఈ పట్టణపు రాజుగారి తీర్పు తమాషాగా వున్నదని వినోదిస్తూ జయపాలుడు దర్బారు వదలి అవతలకు వస్తూండగా ఒక చెవి లేనివాడు ఎదురై, "ఓహో, ఎన్నాళ్లకు కనపడినావయ్యా అబ్బాయీ! నీ తండ్రివద్ద నా చెవి ఒకటి తాకట్టు పెట్టి వున్నాను. ఆ పద్దు ఈ రోజుకు వడ్డీతో సహా నాలుగు వేల రూపాయలు అయింది. ఇదుగో, నీ సొమ్ము నువు తీసుకొని, నా చెవి నాకు ఇచ్చివేయు" మని చెప్ప కూర్చున్నాడు.

దీనికి జయపాలుడు బదులు చెప్పలేక తెల్లముఖం వేశాడు. ఇది చూచి, చెవి లేనివాడు, జయపాలుని లోకువకట్టి రాజు వద్ద ఫిర్యాదు చేశాడు.

రాజు విచారణ చేసి, ఈసారి కూడా జయపాలుడే నేరస్థుడని నిర్ణయించి, ఒక ఓడ చెవి లేనివానికి ఇచ్చుకొనవలసిందని తీర్పు చెప్పాడు. ఈ విధంగా జయపాలుని ఓడలు నాలుగింటిలో రెండు పోయినయి.

జయపాలుడు ఎంతమాత్రము విచారించక, ఈ విషూరాలకు వినోదిస్తూ తన దారిని తను వెళుతూవుండగా, ఒక స్త్రీ ఎదురై, "ఏమయ్యా అబ్బాయీ! ఎంత కాలానికి కనపడినావు! బాగానే వుందిలే. నేనెవర ననుకొన్నావు? పదిహేనేళ్ల క్రిందట మీ తండ్రి నన్ను గాంధర్వ వివాహం చేసికొని, నావంక చూడకుండా వదిలేశాడు. నేను మనవర్తికోసం తగాయిదా చేసేసరికి 'మా అబ్బాయిచేత పదివేల రూపాయలు పంపిస్తా'నని చెప్పాడు. అందు చేత, ఆ సొమ్ము ఇచ్చి మరీ కదలవయ్యా' అని ఆమె అతనిని నిర్బంధించింది.

"నువు ఎవరవో. నీ సొమ్ము ఏమిటో నాకేమీ తెలియదు పో" అని జయపాలుడు నిరాకరించేసరికి, ఆమె పోయి రాజుతో ఫిర్యాదు చేసింది.

ఈసారి మళ్లీ రాజు విచారణ చేసి, జయపాలుని నేరస్థునిగా నిశ్చయించి, ఆ స్త్రీకి ఒక ఓడ ఇచ్చివేయుమని తీర్పు చెప్పాడు.

ఇప్పుడు జయపాలుని ఓడలలో మూడు పోయినై. ఇంక ఒక్కటే మిగిలివున్నది.



తండ్రి చెప్పినమాట విననందుకు తగిన శాస్తి ఐందికదా అనిఒకసారి జయపాలుడు అనుకొన్నాడు. ఇంతలో ఒక మంగలి ఆ దారిని పోతూవుండేసరికి, 'ఐనదేమో ఐంది. శుభ్రంగా క్షౌరమైనా చేయించుకుందా' మని అతను మంగలిని పిలిచాడు.

"అయ్యా. ఏమిస్తారేమిటి"? అని మంగలి అడిగాడు.

'నీకు అనుమాన మెందుకురా, అబ్బాయీ నిన్ను సంతోషపెట్టితే సరిగదా?' అని జయపాలుడు వానికి నచ్చ జెప్పి, పని చేయించుకొన్నాడు.

క్షవురం పూర్తికాగానే జయపాలుడు అతనికి అయిదు రూపాయలు ఇవ్వబోగా




మంగలి పుచ్చుకోలేదు. మరి అయిదు రూపాయలు ఇచ్చాడు. మంగలి మళ్లీ వద్దు అన్నాడు. అలా ఎంత సొమ్ము ఇచ్చినా చాలదు అని చెప్పి మంగలి తీసుకొనటం లేదు. పైగా, రాజువద్దకు పోయి, 'నన్ను సంతోషపెడతానని చెప్పి ఈయన పని చేయించుకొన్నాడు. కాని సంతోషపెట్టలేకపోయాడు' అని ఫిర్యాదు చేశాడు.

ఈ నేరముకూడా విచారణ చేసి, జయపాలునిదే తప్పు అని రాజు తీర్పు చెప్పి, మంగలికి ఒక ఓడ పరిహారము ఇవ్వమన్నారు. చేసేది లేక, జయపాలుడు తనవద్ద మిగిలివున్న నాలుగవ ఓడను కూడ వదులుకొన్నాడు. ఇలా తను తెచ్చుకొన్న నాలుగు ఓడలూ పంచక మహా పట్టణంలో ఫిర్యాదీలకు సమర్పించుకుని జయపాలుడు నిర్భాగ్యుడై ఏమీ తోచక, సముద్రతీరాన విచారంగా కూర్చున్నాడు.

అక్కడ ఒక సన్యాసి కనబడి, 'జయపాలా! నీ విచారానికి కారణం నాతో చెప్పు. నేను చేయగల సాయముంటే చేస్తాను' అన్నాడు. అప్పుడు అతనికి కొంచెం ధైర్యం కలిగి, తన సంగతి సందర్భాలన్నీ ఆయనతో వివరంగా చెప్పేవరకు సన్యాసి అతని చెవిలో ఏదో యుక్తి చెప్పి, చేతికి ఒక రత్నాలహారం ఇచ్చి "పో, నాయనా! ఇక నీ కంతా జయమే కలుగుతుంది!" అని దీవించాడు.

సంతోషంతో జయపాలుడు సరాసరి రాజుగారి కోటలోకి వెళ్లి, ఆడుకొంటూ వున్న రాజుగారి పాపాయి మెడలో తన వద్దనున్న రత్నాలహారం అలంకరించాడు.

అందమయిన ఇటువంటి హారం బహుమతి చేసిన జయపాలుని ఎంతో మెచ్చుకొని, రాజుగారు 'అబ్బాయీ! మాకు చాలా సంతోషమయింది. నీకు ఏమి కావాలో కోరుకో' మన్నారు.

అప్పుడు అతను వినయముతో చేతులు రెండూ జోడించి, "మహారాజా!, తమరు ధర్మ ప్రభువులు. కాని, నా రోజులు బాగా లేక నా పయిన అన్యాయంగా నాలుగు నేరాలు మోపబడి, నేను వర్తకం కోసం తెచ్చుకొన్న నాలుగు ఓడలూ మీ రాజ్యంలో ఫిర్యాదీలకు పరిహారంకింద ఇచ్చుకొనవలసివచ్చింది. ఈ నేరాలను ఏలినవారు మళ్లీ విచారణ చేసి, న్యాయం అనుగ్రహించమని ప్రార్థన" అని కోరాడు.

రాజుగారు ఇందుకు వొప్పుకొని, నాలుగు నేరాలకు సంబంధించిన ఫిర్యాదీలను హాజరు పెట్టించి, జయపాలుడు చెప్పుకోగలిగిన దేమయినా వుంటే చెప్పుకో మన్నారు.

అప్పుడు జయపాలుడు నాలుగు నేరాలనుగురించిన వివరాలూ రాజుగారితో ఇలా విన్నవించాడు :

"అయ్యా! నా తండ్రి చేపరూపముతో వుండి సముద్రంమీద నాకు ఓడలు నడపటం నేర్పుతూవుండగా, ఆ పల్లెవాని తండ్రి నీటికొంగ రూపంతో వచ్చి నా తండ్రిని మింగివేశాడండి. అందుకని నేను తుపాకితో నీటికొంగను కాల్చవలసి




వచ్చింది' అని మొదటి నేరానికి తన సమాధానం చెప్పుకొన్నాడు. రాజు సంతోషించి, పల్లెవాని చేత జయపాలునికి ఓడను తిరిగి ఇప్పించివేశాడు.

తరువాత ఒకచెవి లేనివాడు వచ్చాడు.

"దేవరా! నా తండ్రి ఎన్నో కొన్ని వేల చెవులను తాకట్టు పట్టినాడండి. అందులో ఇతని చెవి ఏదో గుర్తుపట్టడం కష్టమండి. ఆ రెండవచెవి నాకిచ్చినట్టయితే పద్దులలో అతనిచెవి ఎక్కడవున్నదో వెతికి ఇస్తానండి" అని జయపాలుడు చెప్పేవరకు, చెవిలేని వాడు రెండోచెవి ఈయుడానికి భయపడ్డాడు. అందుచేత, తప్పు వానిదేనని ఒప్పుకుని

వానిచేత రాజుగారు ఓడను తిరిగి జయపాలునికి ఇప్పించివేశారు.

విడాకులు పుచ్చుకున్న స్త్రీ వచ్చింది. అప్పుడు జయపాలుడు "ఏలికా! ఈమెకు పది వేలరూపాయలు ఇవ్వమని మా తండ్రి చెప్పినమాట నిజమేనండి. అయితే, మా కులాచారప్రకారం భర్తతోకూడా భార్య సహగమనం చేయాలి. ఇప్పుడయినా సరే, ఈమె ఆ పని చేసినపక్షమందు, మనవర్తి సొమ్ము ఆమె వారసులకు ఈయటానికి అభ్యంతరం లేదండి!" అన్నాడు. ఆ స్త్రీ సహగమనానికి అంగీకరించలేదు. కనక ఆమెచేత మూడవ ఓడను జయపాలునికి ఇప్పించివేశారు రాజుగారు.

ఇంక, చివరకు మంగలి వచ్చాడు. ఇక్కడ జయపాలుడు అన్నిటినీ మించిన చిత్రం చేశాడు. నిండు దర్బారులో రాజుగారి పాపాయిని ఎత్తుకుని ముద్దాడుతూ, "మన పాపాయి ఈ రత్నాలహారము వేసుకోవడం మీకు సంతోషంగానే వుందా?" అని జయపాలుడు దర్బారులో ఒక్కొక్కళ్లనే వరసగా పేరుపేరునా అడిగాడు. అందరూ 'సంతోషంగా వున్న' దన్నారు. చివరకు తనకు పనిచేసిన మంగలిని కూడా అడిగేసరికి వాడుకూడా 'సంతోషమే బాబయ్యా!' అన్నాడు. "మహరాజా! ఇప్పుడు నేను చేసిన పని సంతోషమేనని మంగలి తనకు తనే వప్పుకొన్నాడు, విన్నారుకద" అని అనేసరికి, రాజు సంతోషించి మంగలి తీసుకున్న ఓడను మళ్లీ జయపాలునికి ఇప్పించివేశాడు.

ఈవిధంగా ఎన్ని కష్టనష్టాలు పడినప్పటికీ జయపాలుడు యుక్తివల్ల, సన్యాసి దీవనవల్లా తన నాలుగు ఓడలనూ తిరుగా సంపాయించుకొని, వర్తకంలో లాభం గడించి సుఖంగా ఇంటికి చేరుకొన్నాడు.






కొండయపాలెం అనే గ్రామంలో అవధానులుగారు, భార్యా ఉంటూవుండేవారు.

తీర్థయాత్ర చేసుకువద్దామనే వుద్దేశంతో అవధానులు శ్రమపడి మున్నూరు వరకూ ఆర్జించి, రెండువందలు చేతపట్టుకున్నాడు. తక్కిన నూరు రూపాయలతో తిరిగి వచ్చాక సమారాధనలు జరుపుదామని ఆ వెండిరూపాయలు ఓముంతలో పోసి, మూతి బిగించి ఆవూరికల్లా పలుకుబడిగల బొర్రయ్య శెట్టికి దాచమని ఇచ్చాడు.

అవధాన్లు కుటుంబంతోసహా యాత్రకు పోవటం చూసి, బొర్రయ్యశెట్టికి ఆ సొమ్ము కాజేదామని బుద్ధిపుట్టింది. వెంటనే ఆ సొమ్ము తీసుకుని, బదులుగా రాళ్లూ రప్పలూ పడవేసి, ఎప్పటిలాగ మూత బిగించి వేశాడు.

భర్తచేస్తున్న ద్రోహంకనిపెట్టి శెట్టిభార్య 'ఇటువంటి పని వద్దు. మనకు శ్రేయస్సు కాదు' అని అనేకవిధాల చెప్పిచూచింది. కాని, శెట్టికి ఈమాటలు నచ్చలేదు.

మరికొద్ది రోజులకే అవధాన్లు యాత్రలు ముగించుకొని వచ్చేశాడు. బొర్రయ్య శెట్టి వద్ద దాచిబెట్టిన తన ముంత అడిగి తీసికొన్నాడు. కాని తీరా మూత తీసి చూసుకోగా రూపాయలకు బదులు రాళ్లూ రప్పలూ ఉండేసరికి ఆయన గోల పెడుతూ పోయి, గ్రామాధికారి వద్ద ఫిర్యాదు చేశాడు.

గ్రామాధికారి అంతా విని తీర్పు చెప్పడంఎలాగా అనే విషయం ఏమీతోచక ఆలోచిస్తూ కూర్చున్నాడు. ఆయనకూతురు చాలా తెలివయినది. విచారించవద్దని ఆమె తండ్రికి ధైర్యంచెప్పి, ఈ పేచీ తనే పరిష్కరిస్తానన్నది.

మరునాడు అవధానులు, ఆయన భార్య, బొర్రయ్యశెట్టి, అతని భార్య గ్రామాధికారి

మల్లాది సోదరులు, తెనాలి

ఇంటి సావిట్లో హాజరయినారు. అక్కడ మూతవేసిన నాలుగు బుట్టలు సిద్ధంగా ఉన్నాయి.

తన కూతురు సలహాప్రకారం గ్రామాధికారి ఆబుట్టలలో రెండింటిని అవధానులు దంపతుల నెత్తిమీదకూ తక్కిన రెండూ బొర్రయ్యశెట్టి దంపతుల నెత్తిమీదకూ ఎత్తించాడు. 'మీరు నలుగురూ ఈబుట్టలు మోసుకుని ఆ కనపడే పెద్ద మర్రిచెట్టు వరకూ పోయిరండి, తీర్పు చెబుతా' నంటూ గ్రామాధికారి అవధాన్లు దంపతులను తూర్పుదిక్కుకీ, శెట్టినీ భార్యనూ పడమటి దిక్కుకీ పంపించాడు.

ఆప్రకారం నెత్తిని బుట్టలు ఎత్తుకుని వారు పోతూ ఎవళ్ళ తప్పునుగూర్చి వాళ్లు ప్రసంగించుకొన్నారు. 'చెబితే విన్నారు కాదుగదా. పాపం, బ్రాహ్మణ్ణి దగాచేశారు!' అన్నది శెట్టి భార్య. 'ఒక్క నిమిషం కళ్లు మూసుకుందూ, అదే పోతుందీ!' అన్నాడు శెట్టి. 'మనకు డబ్బు వదిలి శని పట్టినట్టు పోయిన సొమ్ము పోగా ఈ మోతకూడా వచ్చిందే' అన్నది అవధాన్లు భార్య. 'పూర్వజన్మ ఫలం...' అన్నాడు భర్త.

నలుగురూ తిరుగా గ్రామాధికారివద్దకు వచ్చి వారివారి బుట్టలు కింద పెట్టారు. ఆయన కూతురు మూతలు తీసేవరకు నలుగురు పిల్లలు కాగితాలు చేతపట్టుకుని బిలబిలమంటూ బయటకు వచ్చారు. ఆ కాగితాలమీద వాళ్లు వాళ్లు అనుకున్న మాటలన్నీ స్పష్టంగా వ్రాసి ఉన్నాయి. అప్పుడు గ్రామాధికారికి నిజానిజాలు సులువుగా తెలిసిపోయినై. అవధాన్ల సొమ్ము ఆయనకు తిరుగా ఇప్పించివేసి, బొర్రయ్య శెట్టిని ఖైదులో వేయించారు. కూతురు తెలివివలన గ్రామాధికారి ఇంత చక్కటి తీర్పు చెప్పగలిగాడు.






పూర్వకాలంలో ఒక రాజుకి ఒక్కడే కుమారుడు. అతని పేరు బుద్ధిసాగరుడు. రోజూ సాయంకాలం గుర్రాల సాలలోకి వెళ్లి, పంచకల్యాణిని స్వయంగా తీసుకొని, స్వారి వెళ్లటం అతనికి మామూలు.

ఒకనాడు అతను గుర్రాల సాలకు పోయేసరికి, అక్కడ ఒక చిన్న పిల్లిపిల్ల కనపడి, "రాజకుమారా! త్వరలోనే మీ తల్లికి ఒక రాక్షసి బిడ్డ పుట్టబోతున్నది. ఆమె నిన్నూ, మీ కుటుంబాన్నీ మింగివేసి, ఇల్లు నేలమట్టం చేసివేస్తుంది. కనుక నీవు ఈ వెంటనే భూలోకం చివరనున్న పువ్వులకోటకు వెళ్లిపోతివంటే తప్పించుకోగలుగుతావు" అని చెప్పింది.

ఇది విన్న తక్షణమే బుద్ధిసాగరుడు పంచకల్యాణిపైన దౌడు ప్రారంభించాడు. కొంతదూరంలో అతనికి ఒక మైదానం కనపడింది. అక్కడ ఇద్దరు అవ్వలు కూచుని కుట్టు కుడుతూ కనిపించారు. దారం తెగిపోతే కొత్త దారం తీసుకుని, సూదులు విరిగిపోతే కొత్త సూదులు తీసుకొని వాళ్లు అలా కుట్టుతూనే వున్నారు.

'అవ్వల్లారా! ఇదేనా భూలోకానికి చివర, చెప్పండి. నా రాక్షసిచెల్లెలు వెతుక్కుంటూ వచ్చి, నన్ను కబళించివేస్తుంది. అందుకని మీతో ఇక్కడ ఉండిపోతాను' అన్నాడు రాజకుమారుడు.

"నాయనా, భూలోకానికి చివర ఇది కాదు. ఈ దారమంతా అయిపోయి, సూదులన్నీ విరిగిపోగానే మేము చచ్చిపోతాము. అప్పుడు మీ చెల్లెలు వచ్చిపడితే నువ్వెక్కడికి పోగలవు! మాదగ్గర ఉండటం నీకు క్షేమం కాదు" అని అవ్వలిద్దరూ అతనితో చెప్పారు.

తన బతుకు ఒంటిపాటు అయినందుకు విచారిస్తూ, బుద్ధిసాగరుడు మళ్లీ దౌడు తీసి

డి. హేమలత, రాజమండ్రి.




ఒక అడవి చేరుకొన్నాడు. అక్కడ చెట్టుపీకుడుగాడు పెద్దపెద్ద వృక్షాలను పీకి పడవేస్తుంటే, అవి పెళపెళా శబ్దం చేస్తూ వున్నాయి. రాజకుమారుడు అతనితో "అబ్బీ! ఇదేనా భూలోకానికి చివర, చెప్పు. నా చెల్లెలు వెతుక్కుంటూ వచ్చి, నన్ను కబళించివేస్తుంది. అందుకని నీతో ఇక్కడ ఉండిపోతాను" అన్నాడు.

"నాయనా, భూలోకానికి ఇది చివర కాదు. ఇంక కొద్ది చెట్లే ఉన్నాయి. అవి పీకడం పూర్తి కావడంతో నా ఆయువు సరిపోతుంది. అప్పుడు అమాంతంగా నీ చెల్లెలు వచ్చి కబళించబోతే నువ్వెక్కడికి పోగలవు? నాదగ్గర ఉంటటం నీకు మేలు కాదు" అని చెట్టుపీకుడుగాడు చెప్పాడు.

ఒంటిపాటు బతుకయినందుకు ఏడుస్తూ, బుద్ధిసాగరుడు మళ్లీ దౌడు సాగించాడు. ఈసారి ఒక కొండ ప్రదేశం కనపడింది. అక్కడ పర్వతవర్ధనుడు కొండలను ఎత్తి బంతులలాగ ఎగురవేస్తున్నాడు. అవి ఎత్తునుంచి నేలపైన పడి, దుమ్మయిపోతున్నయి.

పర్వతవర్ధనుణ్ని చూచి రాజకుమారుడు "అబ్బీ! ఇదేనా భూలోకానికి చివర, చెప్పు. నా చెల్లెలు వెతుక్కుంటూ వచ్చి నన్ను కబళించి వేస్తుంది. అందుచేత ఇక్కడ నీతో ఉండిపోతాను" అన్నాడు.

"నాయనా, భూలోకానికి ఇది చివర, కాదు. అదుగో ఆ పర్వతాలు కాసినీ ఎగరవేయడముతో నా జీవితము సరిపోతుంది. అప్పుడు హఠాత్తుగా నీ చెల్లెలు తరుముకువచ్చి కబళించితే నువ్వెక్కడికి పోగలవు? నాదగ్గర ఉండటం నీకు క్షేమం కాదు" అని పర్వతవర్ధనుడు చెప్పాడు.

తన బతుకు ఒంటిపాటయినందుకు ఏడిచి రాగాలెట్టి, బుద్ధిసాగరుడు మళ్లీ దౌడు సాగించాడు.

పోగాపోగా బుద్ధిసాగరుడికి, మేఘాలలో నించి వేలాడుతున్న ఒక పువ్వులమేడ కనపడింది. అదే తప్పకుండా భూలోకానికి చివర అయివుంటుందని అతను నిశ్చయించుకొన్నాడు. తెరిచివున్న వాకిలినించి పంచకల్యాణి సరాసరి కోటలోకి వెళ్లి తోటలో ఆగింది.

కోటలోనించి ఒక సుందరి దిగివచ్చి, రాజకుమారుణ్ని చెయ్యిపట్టుకొని లోపలకు తీసుకుపోయింది. "అబ్బాయీ! నువు వెతుక్కుంటూ వచ్చిన ఆ భూలోకం చివర ఇదేను. ఇంతకాలానికి నువ్వు ఇక్కడికి వచ్చినందుకు నాకు సంతోషంగా వుంది. ఏకాంతంగా ఉండటంవల్ల ఇంత కాలం నాకేమీ తోచిందికాదు. నా పేరు ఛాయాసుందరి. నాతో ఆడుకుంటూ నువు ఇక్కడనే ఉండిపోవాలి" అని ఆమె బుద్ధిసాగరుణ్ణి బలవంతపెట్టింది.

ఛాయాసుందరి ఇష్టప్రకారం అతను పువ్వులకోటలోనే ఉండి, ఆడుతూ పాడుతూ కాలక్షేపం చేస్తున్నాడు. అతను తోటలన్నీ తిరిగేవాడు. చుట్టుపక్కల ఉన్న గుట్టలు ఎక్కేవాడు. అయినా ఛాయాసుందరి అతన్ని ఎప్పుడూ ఆటంకపరచలేదు.



ఒకరోజున బుద్ధిసాగరుడు, కోటపైకి ఎక్కి చుట్టూ చూచాడు. ఒక దిక్కున తన ఊరూ, ఆ వూళ్లో పైకప్పు లేచి పోయిన వాళ్ళ ఇల్లూ, బీటలు వేసిన గోడలూ కళ్ళకు కట్టినట్టు కనబడినయి. ఇదంతా తన రాకసి చెల్లెలు చేసిన పనే అయివుంటుందని అతనికి జ్ఞాపకంవచ్చి, ఏడిచి రాగాలు పెట్టాడు.

అతని కళ్లు ఎర్రగా ఉండటం చూసి, 'ఏమిటి కారణ?' మని ఛాయాసుందరి అడిగింది.

"నా మనస్సు ఏమీ బాగులేదు. నాకు చెల్లెలు పుట్టి, మా కుటుంబాన్ని నాశనం



చేస్తుందని పిల్లిపిల్ల కనపడి చెప్పింది. నేనిప్పుడే ఊరికి పోయి, నా తలిదండ్రులను బతికించగలనేమో చూచి వస్తాను" అని రాజకుమారుడు మాయామర్మం లేకుండా తన మనసులో బాధ చెప్పాడు.

ఛాయాసుందరి ఎంత వద్దని చెప్పినా అతను కాదుకూడదని బయలుదేరాడు. అప్పుడు ఛాయాసుందరి అతనికి ఒక మాయకుంచె, ఒక మాయదువ్వెన్న, రెండుమాయరేగిపళ్లు ఇచ్చి వాటిని ఉపయోగించేవిధం చెప్పి పంపించింది.

పువ్వులకోటనుండి తిరిగివచ్చేటప్పుడు రాజకుమారుడికి ముందు పర్వతవర్ధనుడు కనపడ్డాడు. అతను విసరవలిసినది ఇంక ఒక్క కొండ మాత్రమే ఉన్నది. దానితో అతని పని సరి. అందుకని విచారంగా ఉన్నాడు. బుద్ధిసాగరుడు అతనితో విచారించవద్దని చెప్పి, తనవద్ద ఉన్న మాయకుంచె విసిరేసరికి, భూమి పటేల్ మని బద్దలయి, అందులోనించి కోటివేల పర్వతాలు పైకిపుట్టుకు వచ్చినాయి.

అవి చూచేవరకు పర్వతవర్ధనుడికి ఎంతో సంతోషం కలిగింది. "నాయనా, ఈ పర్వతాలు ఒక వెయ్యేళ్ళవరకూ సరిపోతయి. నాకు మళ్లీ అయువు పోసినందుకు నీకు మేలు కలుగుతుంది" అని రాజకుమారుణ్ణి దీవించి పంపాడు.

రెండో మకాములో చెట్టు పీకుడుగాడు అగుపించాడు. ఇంక అతను పీకవలసినవి రెండే చెట్లు ఉండటంచేత, అవి కాగానే చచ్చిపోతానుకదా అనే బెంగతో ముఖం వేలవేసుకుని వున్నాడు. 'నీకేం భయం లే'దని చెప్పి బుద్ధిసాగరుడు తనదగ్గర ఉన్న మాయదువ్వెన విసిరేసరికి, అక్కడ ఒక గొప్ప అరణ్యం తయారయింది. అది చూచి చెట్టుపీకుడుగాడికి సంతోషం

కలిగింది. "నాయనా, ఈ వృక్షాలు ఒక వెయ్యేళ్లవరకూ చాలును. నాకు మళ్లీ ఆయువు పోసినందుకు నీకు మేలు కలుగుతుంది' అని దీవించి పంపాడు.

తరువాత మైదానంలో బుద్ధిసాగరుడికి అవ్వ లిద్దరూ కనపడ్డారు. సూదులూ, దారమూ ఐపోవచ్చిన కారణంచేత, ఇక ఎలాగా చచ్చిపోతాముకదా అని వాళ్లు విరక్తిగా ఉన్నారు. 'మీకు వచ్చిన భయం లేదు' అని అంటూ బుద్ధిసాగరుడు తన వద్ద ఉన్న రేగిపళ్లు ఇద్దరకూ చెరివకటీ ఇచ్చాడు. అవి తినేసరికి వాళ్ళకు యౌవనం వచ్చేసింది. వాళ్లు చాలా సంతోషించి, "నాయనా! నీ ధర్మమా అని మాకు మళ్లీ వెయ్యేళ్ళవరకూ ఆయువు పోశావు. మేము ఇంతకాలంనించీ అల్లుతూ వున్న జేబురుమాలు నీకు బహుమతి చేస్తున్నాము. పనివచ్చినప్పుడు దీనిని నేల మీద విసిరినట్టయితే నీకు కావలసిన సహాయం కలుగుతుంది. దగ్గిర ఉంచుకో" మని చెప్పి దీవించి ఇచ్చారు.

బుద్ధిసాగరుడు ఇల్లు చేరుకునేసరికి తల్లీ లేదు, తండ్రీ లేదు. ఒక గోడ బీటలో నించి అతను ఇంటోకి తొంగి చూచాడు.



అన్న ఏక్షణాన వస్తాడో అని చెల్లెలు పెంచిన శరీరం తగ్గించుకుని వుంచింది. ఆమెను చూచి బుద్ధిసాగరుడు భయపడి పారిపోబోయేసరికి, చిరునవ్వు నవ్వుతూ చెల్లెలు ఇవతలకు వచ్చి,

'అన్నయ్యా, నీకోసమే ఎదురుచూస్తూ వున్నాను. ఈ గదిలో హాయిగా పాడుకుంటూ కూర్చో. ఇంతలో నేను ఫలహారం తయారుచేసి పట్టుకువస్తాను" అని ప్రేమతో అహ్వానించింది.

అతను అలాగా కూర్చుని పాడుకుంటూ వుండగా, పిల్లిపిల్ల మళ్లీ వచ్చి "నాయనా, నీ చెల్లెలు నీకోసం ఫలహారం చేస్తున్న



దనుకుంటున్నావు కాబోలు. అదేమీ లేదు. నిన్నే ఫలహారం చేయటానికి సిద్ధం చేసుకొంటున్నది. తక్షణమే పారిపో" అని చెప్పింది.

పిల్లిపిల్ల సలహా ప్రకారం బుద్ధిసాగరుడు పంచకల్యాణిని ఎక్కి పరుగుచ్చుకొన్నాడు. పాట ఆగిపోవటం కనిపెట్టి, చెల్లెలు గదిలోకి వచ్చి చూచింది. అన్న కనపడక పోయేసరికి, అతని జాడ కనుక్కొని ఉరుముకుంటూ వెంబడించింది.

అప్పుడు బుద్ధిసాగరుడు అవ్వ ఇచ్చిన జెబురుమాలు తీసి విసిరాడు. అక్కడ ఒక లోతయిన అగాధం ఏర్పడింది. ఆమె అది దాటి వచ్చేలోపల అతను అడవి చేరుకొన్నాడు. రెప్పపాటు కాలంలో ఆమె అడవికి వచ్చేసింది. ఈలోపల చెట్టుపీకుడుగాడు పెద్ద వృక్షాలు పెకలించి అడ్డుగా పడవేశాడు. అవి తప్పించుకుని ఆమె మళ్లీ బయలుదేరేలోగా బుద్ధిసాగరుడు కొండలు చేరుకొన్నాడు. ఆమె అతనిని వెంట తరుముతూనే వుంది.

అక్కడ పర్వతవర్ధనుడు మాత్రం ఊరుకొన్నాడా? గొప్ప పర్వతాలు కొన్ని ఎత్తి అడ్డు పడవేశాడు. వాటిని తప్పించుకుని ఆమె మళ్లీ వెళ్లేలోపల బుద్ధిసాగరుడు పువ్వులకోట చేరుకొన్నాడు. "ఈసారి ఎలా తప్పించుకుంటావ్!' అని అరుస్తూ గోల పెడుతూ ఆమె వెంటబడుతూనే వుంది.

మేఘాలలోనించి ఇదంతా కనిపెడుతూ వున్న ఛాయాసుందరి కోట తలుపు తెరిచే వుంచింది. పంచకల్యాణి మళ్లీ తలుపులోనించి సరాసరి వెళ్లి కోటలో ఆగింది.

రాక్షసిచెల్లెలు గర్జించుకుంటూ వచ్చి "నా అన్నను నాకు ఇచ్చివేయి" అని ఛాయాసుందరిని అడిగింది. "నేనివ్వను, పో" అని ఛాయాసుందరి చెప్పింది.

ఇక దెబ్బలాడి ఇతనిని జయించలేము. యుక్తిచెయాలి అని ఆమె నిశ్చయించుకుంది. తన శరీరం బాగా తగ్గించి ఒక చిన్నిబాలిక రూపంలో ఛాయాసుందరి వద్దకు వచ్చి, "పోనీ, నే నొక్క మాట చెబుతాను : నన్నూ, మా అన్ననీ త్రాసులో పెట్టి తూచు. ఎవరు ఎక్కువ బరువుంటే వాళ్లు గెలిచినట్టు నాకంటె అతను ఎక్కువ బరువయితే మాటాడక పోతాను, లేకుంటె ఎత్తుకుపోతాను" అని అన్నది.

ఈ మాయమాటలకు ఛాయాసుందరి నవ్వి సరే నన్నది. త్రాసు చిప్పలు భూలోకపు చివరకు అనేటట్టుగా ఛాయాసుందరి మేఘమండలమునించి వేలాడవేసింది. బుద్ధిసాగరుడు ఎక్కిన చిప్ప కిందకంటా దిగిపోయేసరికి, కోపంకొద్దీ చెల్లెలు శరీరం పెంచి, "ఇదుగో, నెనే ఎక్కువ బరువూ!' అంటూ త్రాసుచిప్పలోకి దూకింది. ఆమె బరువుకి త్రాసుచిప్ప తెగిపోయి ఆమె నేలమీదికి దొర్లిపోయింది.

ఆ చిప్ప ఎప్పుడయితే తెగిపోయిందో, బుద్ధిసాగరుడున్న త్రాసుచిప్ప పైకంటా లేచిపోయింది. అతను తెరిచివున్న తలుపు లోనించి దూరి, మేఘమండలంలోని పువ్వుల కోటలోకి వెళ్లిపోయాడు.

కోపంపట్టలేక పళ్లు కొరుకుతూ వున్న చెల్లెలిని చూచి నవ్వుతూ, ఛాయాసుందరి మెల్లిగా కిటికీతలుపులు మూసివేసింది.

అంతటినించీ చెల్లెలి పీడ లేకుండా ఛాయాసుందరీ, బుద్ధిసాగరుడూ హాయిగా కోటలో ఆడుకొంటున్నారు వాళ్లు పగటి పూట నక్షత్రాలను పట్టుకుపోయి వాటితో ఆడుకొంటారు. అందుకనే పగలు మనకి చుక్కలు కనపడవు. రాత్రిళ్లు మళ్లీ పట్టుకువచ్చి వాటిని మనకోసం ఆకాశం మీద వదిలేస్తుంటారు.






పైన వున్న తొమ్మిది బొమ్మలూ, అన్నీ ఒకేమాదిరిగా కనిపిస్తున్నా, నిజానికి అలాలేవు. తొమ్మిదింటిలో రెండుమాత్రమే ఒక్కమాదిరిగా వున్నై. ఆ రెండు ఏవో కనుక్కోండి. మీరు కనుక్కోలేకపోతే జవాబుకి 51-వ పేజీ చూడండి.




ఈమధ్య జపానుపిల్లలు భారత ప్రధాని పండిత నెహ్రూకు వుత్తరాలు వ్రాశారనీ, వారి కోరిక తీర్పటానికి పండిత నెహ్రూ ఏనుగను పంపిస్తున్నారనీ వచ్చిన వార్త మీరు వినివుంటారు.

హిమాంశు నియోగీ అనే కలకత్తావర్తకుడు ఇటీవల జపానుకు వెళ్లినప్పుడు. ఆ విద్యార్థులందరూ తమ ఉత్తరాలను నెహ్రూపండితునికి అందజేయుమని నియోగిని నియోగించారు. ఆయన అందుకొన్న ఇటువంటి లేఖలు లెక్కకు 815 ఉన్నాయి.

వారు పంపిన వుత్తరాలూ, వివరాలూ దీనిలో చూడండి.




# పిల్లల పెంపకం

## స్నానము

ప్రతిరోజూ ఉదయమూ, సాయంకాలమూ రెండుపూటలా స్నానం చేయటం ఆరోగ్యకరం. అందులోనూ ఉదయస్నానం చాలా ముఖ్యం. స్నానమంటే ఊరికే గోడమీద పోసుకొన్నట్టు ఒళ్లు తడిపితే ప్రయోజనంలేదు.

ఎత్తు ప్రదేశంనించి చల్లటి నీళ్లు తలపైన పడేటట్టు స్నానం చేస్తే, హాయిగా ఉండటమేగాక, అందువల్ల విద్యుచ్ఛక్తి పుట్టి శరీరానికి ఉత్సాహాన్ని ఇస్తుంది.

జబ్బుతో ఉన్నవాళ్లు తప్పనిసరి ఐతే వైద్యరీత్యా వేడినీళ్లు పోసుకోవలసిందే కాని, సామాన్యంగా చన్నీటి స్నానమే ప్రశస్తం. చన్నీటి స్నానంవల్ల జలుబు పడుతుందని చాలామంది భయపడుతూవుంటారు. అది వట్టిమాట.

స్నానం చేసేటప్పుడు కుంకుడుకాయతోగాని, శీకాయతోకాని ఒళ్లు గట్టిగా తోమినట్టయితే, చర్మరంధ్రాలలో చేరిన మలినములు వొదిలిపోతయి. ఈరోజులలో శరీరానికి కాంతినిచ్చే రకరకాల సబ్బులుకూడా దొరుకుతున్నయి.

ఏ నీరు స్నానానికి మంచిది? అని కొంతమంది ప్రశ్నిస్తారు. ప్రవహించే ఉదకమే స్నానానికి ఉత్తమమైంది. నిలవ ఉండే చెరువు నీరు, నూతి నీరు మొదలైనవి దాని తరువాతివే.

మంచినీటికే కరువైన కొన్ని ప్రదేశాలు ఉన్నాయి. అటువంటి చోట్ల కావలసినన్ని నీళ్లు ఇష్టమొచ్చినంతసేపు స్నానం చేయాలంటె ఎలా వీలవుతుంది? నీటి వసతి బాగావుండే ప్రదేశాలలో పిల్లలు బద్ధకంవల్ల స్నానం చేయటం లేదంటే అది పెద్దపొరపాటు. పిల్లలు ప్రతినిత్యమూ స్నానంచేసేట్టు చూడటం పెద్దల విధి.

శుభ్రంగా, తృప్తికరంగా స్నానం చేయాలంటే మరుగు స్థలమే తగినది. అందుకనే, ప్రతి ఇంటా స్నానపు గది ఉండటం చాలా అవసరం.

మీ పెద్దమ్మ

# గళ్లల్లో దొంగ



ఈ చదరంలో చిక్కిరి బిక్కిరిగా చాలా గళ్లు కనిపిస్తున్నవి కదూ? కొన్ని గళ్లు ఖాళీగానూ, కొన్ని చుక్కలతోనూ వున్నవి. చుక్కలున్న గళ్ళకు రంగు పెన్సిలుతో రంగులు వెయ్యండి. గళ్ళల్లో దొంగని పట్టగలరు.

పజిలుకు జవాబు

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 త | ని | 2 పి | | 3 స | త్య | 4 ము |
| లు | ● | ళ్లు | | మ | ● | ద |
| 5 పు | లి | ● | 6 వా | య | స | ము |
| | | 7 లో | ● | ము | | |
| 8 ఆ | లో | చ | న | ● | 9 బ | 10 స |
| మ | ● | న | | 11 దీ | ● | మా |
| 12 ని | త్య | ము | | 13 వి | రో | ధి |



48-వ పేజీలోని చిక్కు బొమ్మలకి జవాబు: 4, 9 నెంబర్లుగల బొమ్మలు రెండూ ఒక్క మాదిరివి



# ఇంద్రజాలము

ఇప్పుడు మీకొక చిత్రం చెప్పదలచు కొన్నాను: పి. సి. సర్కార్ అనే పేరు విన్నారో లేదో! ఆయన మన భారతీయుడు. ఇంద్రజాల విద్యలో చాల గొప్పవాడు.

ప్రపంచపు మొత్తం మీద పేరొందిన పెద్ద గారడివాండ్రలో మన పి. సి. సర్కార్ ఒకరు.



ఈయన ప్రపంచమంతా సంచారంచేసి అద్భుతమైన తన ప్రదర్శనాలతో లక్షలాది ప్రజలను అనందింపజేశారు.

గారడి, మెస్మరిజం విద్యలనుగురించి, హస్తలాఘవం, టక్కుటమారా గజకర్ణ గోకర్ణ విద్యలగురించీ, కనుకట్టు వినోదాల గురించీ అనేక గ్రంథాలను ప్రకటించి వున్నారు. ప్రపంచంలో గారడి విద్యను గురించి వెలువడే పత్రికలన్నిటికీ ఈయన వ్యాసాలు వ్రాస్తారు.

మన సర్కారుగారి రచనలు ఫ్రెంచి, డచ్చి, స్పానిష్, ఇంగ్లీష్ మొదలైన భాషలలోకి కూడా తరుమా అవుతూ వుంటయి.

అమెరికా పత్రికలు వీరి వ్యాసాలను ఎక్కువ అభిమానంతో ప్రకటిస్తూ వుంటాయి. అమెరికాలోని అనేక ప్రసిద్ధ పత్రికలు మన సర్కార్‌గారి ఫోటోను ముఖచిత్రంగా ప్రకటించుకొన్నయికూడా. నిజానికి, ఇదెంత గొప్ప విషయం?

నోబెల్ బహుమానము మోస్తరుగానే (అమెరికా) న్యూయార్కులో ప్రకటిత మయ్యే 'స్ఫింక్స్' పత్రికవారు ఏటేటా ప్రపంచపు గొప్ప మాజిషన్లకు బహుమానం ఇస్తూవుంటారు. అటువంటి పోటీకి నిలబడి, స్ఫింక్సు బహుమానాన్ని రెండుసార్లు అందుకొన్న ప్రముఖుడు మన సర్కార్

ఒక్కరే. ఇంకా చెప్పవలెనంటే ఈయన పొందిన ఘనతలు లెక్కకు మిక్కిలిగా ఉన్నాయి.

ఇంద్రజాల సామ్రాజ్యంలో మేటి ఐన సర్కార్ మన భారతదేశానికి మణిపూస అని చెప్పుకొని మనం. గర్వించవచ్చు. ఇటువంటి సిద్ధహస్తుడు, అంతర్జాతీయ ఖ్యాతిని ఆర్జించిన ఐంద్రజాలికుడు ప్రత్యేకించి 'చందమామ' పాఠకులకు గారడి చిత్రాలను నెలనెలా అందజేసి, ఆనందింపజేస్తామన్నారు.

సర్కార్‌గారి గారడి చిత్రాలను బొమ్మలతోసహా, వచ్చే సంచికనుండి ఈ శీర్షిక కింద ప్రకటించబోతున్నాము. అద్భుతమైన ఆ ట్రిక్కులన్నీ చెప్పినప్రకారము శ్రద్ధగా చేశారంటే మీకూ, మీ స్నేహితులకూ చెప్పలేని ఆనందాన్ని, వినోదాన్ని చేకూరుస్తాయి.

ఇప్పటినించీ ఈ ఇంద్రజాలవిద్యను మీరు నేర్చుకొని, సిద్ధహస్తులైనారంటే, పెద్దవారైనతరువాత గొప్ప మాజిషన్లుగా తయారయి, ధనమూ కీర్తికూడ ఆర్జించగలరు.

# చందమామ పజిల్
(భాషాభివృద్ధికి)

## ఆధారములు

**అడ్డము :**

1. సంతృప్తి
5. నిజము
5. క్రూరజంతువు
6. కాకి
8. తలపు
9. మకాము
12. శాశ్వతము
13. శత్రువు



**నిలువు :**

1. కవాటము
2. ధనుస్సు
3. వేళ
4. సంతోషము
7. కన్ను
8. వసంతము
10. యోగనిద్ర
11. ద్వీపము





# అంకెల తమాషాలు

142857 అనే అంకె ఉంది. దీనిని రాసుకొమ్మని నీ స్నేహితునితో చెప్పు. ఈ అంకెను 2 నుంచి 7 వరకు ఏ అంకెతోనైనా హెచ్చవెయ్యమను. ఆ వచ్చిన జవాబు అంతా నీకు చెప్పనక్కరలేదు. అందులో ఏదో ఒక స్థానంలోని ఒక అంకెను చెప్పమను. ఆ స్థానంలో ఆ అంకెను వేసి నువ్వు పూర్తి జవాబు వ్రాసి ఇవ్వడమే కాక ఏ అంకెతో హెచ్చవేసినదికూడా చెప్పగలవు. ఎలాగో తెలుసునా ?

142857 అనే అంకెను 2 మొదలు 6 దాకా ఏ అంకెతో హెచ్చవేసిన ఈ ఆరు అంకెలే తారుమారవుతూ ఉంటాయి. ఉదాహరణకి నీ స్నేహితుడు 4-తో 142857 ను హెచ్చవేసినాడనుకో $142857 \times 4 = 5714280$. ఇందులో మూడో స్థానంలోని 1 నీకు చెప్పాడనుకో. దానికి కుడివైపున 4, 2, 8, ఎడమవైపున 7, 5 (571428) వేసి సరియైన జవాబు చెప్పడమే కాక ఏ అంకెతో హెచ్చవేసినది నువ్వు పోల్చుకోగలవు. 7 తో 142857 ని హెచ్చ వేస్తే 999999 వస్తుంది: ఇది సులభంగా జ్ఞాపకం ఉంటుంది.

నాలుగు తొమ్మదులు నూరు. ఎలాగో తెలుసా ?

ఎనిమిది ఎనిమిదులు వెయ్యి. ఎలాగో తెలుసా ?

$\frac{9}{9} = 1$

కాబట్టి

$99\frac{9}{9} = 100$

$$\begin{array}{r} 888 \\ 88 \\ 8 \\ 8 \\ 8 \\ \hline 1000 \\ \hline \end{array}$$

అబ్బాయిలూ, అమ్మాయిలూ!

మీకు అక్షరాలూ, గుణింతాలూ, వత్తులూ వచ్చేసినయ్.
ఇప్పుడు ఈ క్రింది పాఠం చదువుకోండి.

| | | |
|---|---|---|
| यह = ఇది, ఇతడు, ఈమె, ఈ | किताब = పుస్తకము | क्या = ఏమి |
| वह = అది, అతడు, ఆమె, ఆ | कलम = కలము | कहां = ఎక్కడ |
| है = ఉన్నాడు, ఉన్నది | मेज़ = మేజాబల్ల | पर = మీద, పైన |
| दवात = సిరాబుడ్డి | में = లో, లోపల | घर = ఇల్లు |
| कौन = ఎవడు, ఎవతె, ఎవరు | लडका = పిల్లవాడు | का, की = యొక్క |
| बहन = సోదరి | एक = ఒక | लडकी = ఆడపిల్ల |

| | | |
|---|---|---|
| यह किताब है। | किताब मेज़ पर है। | वह राम है। |
| यह कलम है। | मेज़ कहां है ? | वह लड़का है। |
| कलम दवात में है। | मेज़ घर में है। | वह कहां है ? |
| किताब मेज़ पर है। | यह क्या है ? | वह घर में है। |
| मेज़ घर में है। | यह कलम है। | राम का घर मांबलम में है। |
| यह क्या है ? | कलम कहां है ? | वह कौन है। |
| यह किताब है। | कलम दवात में है। | वह रमणी है। |
| किताब कहां है ? | वह कौन है ? | रमणी राम की बहन है। |



క్రిందటి సారి 'సీతాకోక చిలుకల' బొమ్మకి రంగులు వేశారుకదూ. ఇప్పుడు 'జింక' బొమ్మకి ఏ రంగులువేస్తే బాగుంటుందో అలా రంగులు వెయ్యండి. మీరు రంగులువేసిన బొమ్మని వచ్చేనెల చందమామ అట్టమీది బొమ్మతో పోల్చుకోండి.

Printed and Published by B. NAGI REDDI, at B. N. K. Press, 37, Acharappan Street, Madras
Editors: CHAKRAPANI and K. RAJA RAO.



Chandamama, August '49 Photo by B. Ranganadham

మేదరి

